

# యువ విజేతలు

**సాధించిన అవార్డులు:**

- గ్రామ్‌శ్రీ మేళా, 2006
- ఫ్రెండ్స్ అసోసియేషన్ ఫర్ రూరల్ కన్‌స్ట్రక్షన్, 2007
- భద్రక్ జూనియర్ కాలేజ్ అథ్లెటిక్ అసోసియేషన్, 2007
- శారదా విహార్ ట్రస్ట్, 2007
- ఉత్కళ్ క్లబ్, బగురాయ్, 2007
- భద్రక్ అటానమస్ కాలేజ్ అథ్లెటిక్ అసోసియేషన్, 2007
- ఈశ్వర్ ఒరియా డైలీ, 2007
- లయన్స్ క్లబ్, భద్రక్, 2007
- రోటరీ క్లబ్ మిడ్ టౌన్, 2008
- వెస్ట్ బెంగాల్ ఒలింపిక్ అసోసియేషన్, 2008

## రాజేశ్వరి దాస్

ఒరిస్సాకు చెందిన తొమ్మిదేళ్ల చిన్నారి రాజేశ్వరి దాస్‌కి పరుగు అంటే మక్కువ. నాలుగేళ్ల చిరుప్రాయం నుంచే తను పరుగుపందేల్లో పాల్గొనడం ప్రారంభించింది.

ఆమె తండ్రి వైకుంఠనాథ్ దాస్ తన కూతురు ప్రయత్నాల పట్ల సంతోషం ప్రకటించారు. ''చిన్నవయసులోనే రాజేశ్వరిలో దాగి ఉన్న శక్తిని చూసి ఆశ్చర్యపోయాను. ఆమె అథ్లెట్ కావాలని, దేశానికి ఆమె ప్రాతినిథ్యం వహించాలని కోరుకుంటున్నాను.''

తన మొదటి పరుగుపందెంలో ఒరిస్సాలోని భద్రక్‌లో ఉన్న తరిని ఆలయం నుంచి అరడి ధామ్ వరకు 40 కిలోమీటర్ల దూరాన్ని ఐదు గంటల లోపు పరుగెత్తిన రాజేశ్వరి అందరినీ అబ్బురపర్చింది.

క్రికెట్ టోర్నీ ప్రారంభోత్సవం సందర్భంగా 2007లో భద్రక్ నుంచి జైపూర్ లోని బిరజా ఖేత్రా వరకు 58 కిలోమీటర్ల మరాథన్ పరుగును ఆమె విజయవంతంగా పూర్తి చేసింది. ఈ సందర్భంగా రాజేశ్వరి మాట్లాడుతూ పరుగంటే తనకెంతో ఇష్టమని చెప్పింది. ఏ మాత్రం అలసిపోకుండానే గంటలపాటు పరుగెత్తగలనని ఆమె ధీమా వ్యక్తం చేసింది.



భారత్ తరపున ఒలింపిక్ క్రీడల్లో ప్రాతినిధ్యం వహించాలని రాజేశ్వరి కల కంటోంది. పరుగే ధ్యేయంగా పరుగెడుతున్న ఈ ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు.

# ఈ సంచికలో...



చందమామ సంపుటి: 63 అక్టోబర్ 2010 సంచిక: 10













**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

# శాంతి, సామరస్యం, బోధకుడు, చెడుపై మంచి విజయం...

ఈ సంవత్సరం దేశంలోని చాలా ప్రాంతాల్లో రుతుపవన వర్షాలు మెండుగా కురిశాయి. ఉత్తరప్రదేశ్, బీహార్, జార్ఖండ్ వంటి కొన్ని రాష్ట్రాల్లో మాత్రం వర్షం పెద్దగా కురవలేదు. దీంతో అక్కడ నీటి నిర్వహణ సమస్య తలెత్తింది. మేం కూడా గత కొద్ది కాలంగా నీటి ప్రాధాన్యతను నొక్కి చెబుతూ వస్తున్నాము.

జాతిపిత జయంతిని జరుపుకుంటున్నాము కాబట్టి ఆయన బోధనలను మన జీవితాలకు వర్తించుకోవలసి ఉంది. వాస్తవానికి, కాలం గడిచే కొద్దీ ఆయన అడుగుజాడల్లో నడుస్తూ ఆయన బోధనల ప్రాధాన్యతను గుర్తించాలని మనం కోరుకుంటున్నాము. గాంధీజీ బోధనలను మనందరం ప్రస్తావిస్తూ ఉన్నప్పుడు, ఆయన బోధనలను మన పిల్లలు అవగాహన చేసుకుని ప్రశంసించడమే కాకుండా వాటిని నేర్చుకునేలా నిర్దిష్ట ప్రణాళికలు రూపొందించవలసి ఉంది.

ఈ నెలలో మనం దసరా పండుగను కూడా జరుపుకుంటున్నాము. చెడుపై మంచి సాధించే విజయానికి ప్రతీక దసరా. మనలోని చెడు అంశాలను మనకు మనమే గుర్తించి వాటిని అధిగమించాలని తీర్మానించుకోవడానికి ఇది చక్కటి అవకాశం. ఈ కోణంలోనే మనం దసరాను జరుపుకోవాలి. మన అంతర్గత బలహీనతలను అధిగమించి మంచి మనుషులుగా మనల్ని మనం తీర్చుకోవాలి.

చందమామ పంపిణీలో జరుగుతున్న జాప్యం కారణంగా మీకు పత్రిక ఆలస్యంగా అందుతున్నందుకు క్షమాపణ చెబుతున్నాము. ముద్రాపకులు గత కొద్ది నెలలుగా సమ్మె చేస్తున్నందువల్లే ఇలా జరుగుతోంది. పత్రికను వివిధ ప్రాంతాల్లో అచ్చువేస్తూ ప్రచురణకు హామీ పడటానికి తీవ్రంగా శ్రమిస్తున్న మా టీమ్‌కి అభినందనలు. ఈ సమస్యను అధిగమించామని, చందమామ సంచికలను ఇకపై సకాలంలో తీసుకువస్తామని ప్రకటించడానికి సంతసిస్తున్నాము.

తమసోమా జ్యోతిర్గమయ!

– సంపాదకులు




అక్టోబర్ 2010 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher:**
Prashant Mulekar
**Associate Editor:**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor:**
Patricia Pandian
**Content Head - Online:**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist:**
Venki
**Layout Designer:**
K. Narendra Raju
**Production In-charge:**
Prashant Pawar
**Circulation:**
e-mail: circulation@chandamama.com
**Head - Sales and Circulation:**
Sanjay B Thorat
**Manager - Sales & Circulation:**
AB Sairam
**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid
**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej
**Sales Officer - Circulation:**
K. Ravishankar
**Advertisement:**
e-mail : sales@chandamama.com
**Subscription:**
e-mail: Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
Jalpa Doshi (Mumbai)
Ph: +91 22 2831 2872/2831 1849
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Editor : Prashant Mulekar


# పాఠకుల లేఖలు

జూలై సంచికలో అమెరికా జానపద కథ 'స్నేహం విలువ' ఆశ్చర్యకరంగా బాగుంది. బేతాళ కథ చివర్లో గందరగోళంగా ముగిసింది. పిల్ల మేఘం కథ పక్కాగా పిల్లలకు సంబంధించినదే. అట్టమీద బొమ్మ కథను నలుపు తెలుపుతో కాకుండా ముఖచిత్రం మీది ఫోటోను మినియేచర్ రూపంలో తీసుకువచ్చి ఉంటే బాగుండేది. జూలై నెలలో ఫోటో వ్యాఖ్యల పేజీ కనబడలేదు. ఇకపై ఇది నెలనెలా కనిపించదు కాబోలు. 'చలమయ్య గోదానం' అద్భుతంగా ఉంది.

– శ్రీలేఖ కొచ్చెర్లకోట, హైదరాబాద్

గత ముప్పై ఏళ్లుగా ఉపాధ్యాయ వృత్తిలో ఉంటూ పిల్లలను చందమామను చదివేలా ప్రోత్సహిస్తున్నాను. ఈనాటి పిల్లలు టీవీలకే అతుక్కుని మంచి మంచి కథల పుస్తకాలు చదవడం లేదు. కానీ మాక్లాసులో పిల్లలు చాలా మంది 20 రూపాయిలు పెట్టి కూడా చందమామ పత్రిక కొని చదువుతున్నారు.

– ఎస్ రామకిష్టయ్యా, కరీంనగర్

చందమామలో శిథిలాలయం సీరియల్ మొదలవటం చాలా ఆనందం కలిగించింది. బొమ్మల రంగులు బాగున్నాయి. పాతపద్ధతిలో ఒక పేజీ మొత్తం బొమ్మ రావటం చాలా బాగుంది. సీరియల్ మొత్తం ఇలాగే కొనసాగించగలరు. చందమామ ఆర్ట్‌బుక్ వివరాలు పత్రిక ద్వారా తెలుపగలరు.

– డి.శివకుమార్, మచిలీపట్నం

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://telugu.chandamama.com**



**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children below 9 years**
**is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..........................................................................

Date of Birth: ................................ Sex :..................................

Address: ......................................................................

..........................................................................................

..........................................................................................

............................................. City: ...................................

State:...................................... Pin:........................................

Telephone:....................................................................

Mobile:..........................................................................

Email:...........................................................................

Subscription Number (for renewals):.........................................

Gift Subscription to the following address:

..........................................................................................

..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque/DD* for Rupees...................................................

Cheque/DD No ..........................................................................

favouring Chandamama India Ltd on.........................................

..........................................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.



# డబ్బు - ధర్మం

శిక్కంగేరి గ్రామంలో ఉండే ధర్మనందనుడు అనే పండితుడి భార్య తాయారమ్మ పరమ పిసినారి. అయితే పైసా ఖర్చుకాకుండా ఎంతో పుణ్యం సంపాయించాలనే ఆశ మాత్రం ఉండేది.

ఒకనాడు చీపురు కట్టలమ్మే ముసలిది, ఇంటి ముందుగా పోతుంటే, పిలిచి ఒక పాత చీర దాని ముందు వేసి, ''ఎన్ని చీపురు కట్టలిస్తావు?'' అని అడిగింది.

''రెండు,'' అన్నది ముసలిది.

''ఏమిటీ? ఒక చీర ఇస్తుంటే, దానికి రెండు చీపురకట్టలిస్తావా సరి సరి! ఈ చీర ఏ పేదదానికైనా ధర్మం చేస్తే బోలెడు పుణ్యం వస్తుంది. రూపాయికెన్ని ఇస్తావు?'' అని అడిగింది తాయారమ్మ.

''నాలుగు,'' అన్నది ముసలిది.

తాయారమ్మే రూపాయిచ్చి, నాలుగు చీపురుకట్టలు తీసుకున్నది. ముసలిది అక్కణ్ణుంచి పోతూ చీర భుజాన వేసుకున్నది.

తాయారమ్మ అది చూసి కోపగించుకుని, ''డబ్బుకు డబ్బూ, చీరా కూడా తీసుకుపోతున్నావా? ఏం నీ గడుసుతనం!'' అన్నది.

ముసలిది చిన్నగా నవ్వి, ''అమ్మగారూ, మీరు చాలా ధర్మాత్ములు. పేదదానినైన నాకు చీర ఇచ్చి బోలెడు పుణ్యం, డబ్బిచ్చి ఇంటికి అవసరం అయిన చీపురుకట్టలూ కొనుక్కున్నారు,'' అన్నది.

తాయారమ్మ ఆశ్చర్యపోతూ, ముసలిదాని వంక చూడసాగింది. అక్కడే ఉన్న ధర్మనందనుడు ''తాయారూ, ఆ ముసలావిడ, నీకెలాంటి గొప్ప ధర్మబోధ చేసిందో గ్రహించావా?'' అన్నాడు నవ్వుతూ.

– కోలార్ కృష్ణ అయ్యర్





# సుంకం వసూలు

రామాపురం, విష్ణుపురం పక్కపక్కన ఉన్న ఊళ్లే అయినప్పటికీ, అవి రెండూ వేరు వేరు రాజ్యాలకు చెందినవి. ఆ ఊళ్లో సరిహద్దుల వద్ద, రెండు రాజ్యాల రాజోద్యోగులూ, వర్తకుల నుంచి సుంకాలు వసూలు చేస్తూండేవారు. రాజోద్యోగులు, సరుకులతో వచ్చిన బళ్లను లెక్క పెట్టి, బండికి ఐదు వరహాల చొప్పున సుంకం వసూలు చేసేవారు. ఒక వర్తకుడు, ఎక్కువ బళ్లమీద సరుకులు తెస్తే, ఐదు బళ్లలో ఒక బండిని సుంకం లేకుండా వదిలి పెట్టేవారు. ప్రధానుడు అనే వర్తకుడు, ఐదు బళ్లమీద సరుకులు వేసుకుని, విష్ణుపురం నుంచి రామాపురానికి బయలుదేరాడు. రామాపురం సరిహద్దుల వద్ద రాజభటులు బళ్ళను ఆపారు. ప్రధానుడి బళ్లముందు ఇంకా అనేక బళ్ళు, సుంకం కట్టడం కోసం నిలబడి ఉన్నాయి.

ప్రధానుడు తన సలహాదారైన చంద్రికుడితో, ''వాళ్లంతా సుంకాలు చెల్లించి కదిలేసరికి, ఆలస్యమవుతుంది. నువ్వు వెళ్లి మన వంతు రాగానే, బళ్ళకు సుంకం చెల్లించిరా,'' అని చంద్రికుడికి ఇరవై వరహాలు ఇచ్చాడు.

చంద్రికుడు వెళ్లి, పది నిమిషాలలో తిరిగి వచ్చి, ఇరవై వరహాలనూ ప్రధానుడికి ఇస్తూ ''మన పని పూర్తయింది. మన బళ్లకు సుంకం కట్టనవసరం లేదు,'' అన్నాడు.

ప్రధానుడు ఆశ్చర్యపోతూ, ''మనవి ఐదు బళ్ళు కదా! వాళ్ళు ఒక్క బండికి కూడా సుంకం తీసుకోలేదా?'' అని అడిగాడు.

చంద్రికుడు నవ్వుతూ, ''మన ముందున్న వర్తకులందరికీ, ఒక్కొక్క బండి మాత్రమే ఉన్నది. నేను వాళ్లతో అందరం కలిసి, ఒకేసారి సుంకం చెల్లిస్తే, త్వరగా ఇక్కడినుంచి కదలవచ్చని చెప్పాను. వాళ్ళు సుంకం డబ్బులు నా చేతిలో పెట్టారు. అప్పుడు నేను రాజోద్యోగుల వద్దకు పోయి, మొత్తం ఇక్కడ ఉన్న బళ్లు మన ఐదు బళ్ళతో కలిపి ఇరవై ఐదని చెప్పాను. నియమానుసారం, రాజోద్యోగులు ఐదు బళ్లకు సుంకం తీసుకోలేదు,'' అని చెప్పాడు.

చంద్రికుడిని ప్రధానుడు మెచ్చుకుని, అతడి వేతనాన్ని రెట్టింపు చేశాడు. - రాంబాబు





# వాదన

ధర్మపురి రాజ్యాన్ని పాలించే నవీన చంద్రుడు సమర్థవంతమైన, తెలివైన పాలకునిగా పేరు తెచ్చుకున్నాడు. ఒక రోజు ఆయన కొలువులో, రాజ్యంలో రెండు ప్రాంతాలకు చెందిన విష్ణుకూటుడు, నైమిశ్యుడు అనే ప్రముఖులు, మా ప్రాంతం గొప్పదంటే మా ప్రాంతం గొప్పదని తీవ్రంగా వాదులాడుకుని మహారాజుని అభిప్రాయం అడిగేరు.

అంతా చూస్తున్న నవీన చంద్రుడు, సభలోకి రెండు రకాలైన తినుబండారాలు తెప్పించాడు. విష్ణుకూటునికి, నైమిశ్యుడికి చెరో రకం ఇచ్చి, తిని రుచి ఎలా ఉందో చెప్పమన్నాడు! ఇద్దరూ వాటిని తిని చాలా బావుంది అంటూ మెచ్చుకున్నారు.

మహారాజు, ఆ రెండింటిలో ఏ తినుబండారం అధిక రుచిగా ఉందో చెప్పండి, అని అడిగాడు. ఇద్దరూ తెల్లమొహాలు వేసి, ''మాకు ఒక రకమే ఇచ్చారు. రెంటినీ రుచి చూడకుండా, ఏ తినుబండారం బావుందో, ఎలా చెప్పగలం ప్రభూ?'' అన్నారు ఆశ్చర్యంగా.

ఆయన నవ్వి, ''మీకు, మీ ప్రాంతం గురించి తప్ప, ఇతరుల ప్రాంతం గురించి, ఏం తెలీదని తెలుస్తూనే ఉంది. మిమ్మల్ని మీరు బలపర్చుకోవటం కోసం, ఇతరుల్ని విమర్శిస్తున్నారంతే, అందుకే తినుబండారాల్లో వీలుకాని స్వోత్కర్ష ప్రాంతాల్లో బయటపడింది. నిజానికి, ప్రతి ప్రాంతం ఏదో ఒక విధంగా గొప్పదే. అది తెలుసుకోవాలంటే, ఆ ప్రాంతాల్లో పర్యటించడమొక్కటే మార్గం! నేటినుంచి, మీరిరువురు, ఒకరి ప్రాంతాల్లో మరొకరు తిరిగిరండి. అప్పుడు, మీ మధ్య ఈ వాదనే రాదన్నది నా అభిప్రాయం!'' అన్నాడు.

తమ తప్పు గ్రహించి విష్ణుకూటుడు, నైమిశ్యుడు సిగ్గుతో తలలు దించుకున్నారు. మహారాజు వితరణకు, తెలివికి సభికులు హర్షధ్వానాలు చేశారు.

– భీమవరపు పురుషోత్తం





# నేత్రలేపనం



విశ్వనాథుడనే వైద్యుడికి, మంచి హస్తవాసి గలవాడన్న పేరున్నది. ఆయన తన వద్దకొచ్చే రోగుల నుంచి పెద్దగా ఆశించే వాడు కాదు. ఒకనాడాయన ఏదో ఔషధం తయారు చేసేందుకు, అటకపై నుంచి పూర్వీకుల నాటి తాళపత్రాలను దించి చూస్తుండగా, వాటిలో నేత్రలేపనం అనే మందు తయారు చేసే పద్ధతి రాసి ఉండటం కనిపించింది. అది ఆయన్ని బాగా ఆకట్టుకున్నది.

దాని విశేషం ఏమిటంటే ఆ లేపనాన్ని కంటికి రాసుకుంటే, భూమిలో నిక్షిప్తమై ఉన్న ఏ వస్తువైనా స్పష్టంగా కనబడు తుంది.

విశ్వనాథుడు కుతూహలం కొద్దీ, కావ లసిన మూలికలు తెచ్చి, కల్వంలో నూరి నేత్రలేపనం తయారు చేసుకున్నాడు. తర్వాత ఆదివారం, అమావాస్య కలిసే రోజు చూసుకుని, ఆ లేపనాన్ని కళ్లకు కాటుకగా పెట్టుకుని, ఊరిబయట పొలాల్లోకి వెళ్లాడు. తాళపత్రాల్లో రాసి ఉన్నట్లే ఆయనకు భూమి లోపల ఉన్న వన్నీ స్పష్టంగా కనబడసాగినై. ఒకచోట పచ్చికబీడులో నిలువులోతున, లంకెల బిందెలు ఆయన దృష్టిని ఆకర్షించాయి.

ఆ లంకెల బిందెలున్న స్థలం, జమీం దారు పెద్దిరాయుడిది. శాస్త్ర ప్రకారం భూమిలో ఆరడుగుల లోపు దొరికే ఏ వస్తువైనా సంబంధిత భూమి యజమా నికే చెందుతుంది.

అందువల్ల, జమీందారుకు ఈ సంగతి చెప్పాలనుకుని, విశ్వనాథుడు లంకెల బిందెలున్న చోట గుర్తుగా ఒకపుల్ల గుచ్చి ఇంటికేసి బయలుదేరాడు.

ఆ రాత్రి భోజనం ముగించి, మర్నాడు జమీందారును కలుసుకుందామని అను కుంటూ విశ్వనాథుడు పడుకున్నాడు. నిద్రపోతూన్న సమయంలో మంచం

వీరేపల్లి జయరాం రెడ్డి

పక్కగా ఏదో అలికిడి అయి ఆయన కళ్లు తెరిచి చూశాడు. ఎదురుగా ఒక భూతం గాల్లో కదులుతూ ఆయన కంటబడింది.

విశ్వనాథుడు కొంచెం భయపడి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని భూతాన్ని ''ఎవరు నువ్వు? నాతో ఏం పని?'' అని అడిగాడు.

భూతం ఆయన కేసి చూస్తూ, ''నే నెవరో తెలియనంత అమాయకుడివా నువ్వు? నేను భూతాన్ని! అందునా పరమ కిరాతక జాతికి చెందిన భూతాన్ని,'' అన్నది.

''సరే, భూతానివైన నీకు మనిషినైన నాతో ఏం పని?'' అని ప్రశ్నించాడు విశ్వ నాథుడు తొణక్కుండా.

ఈ సారి భూతం వికవికమంటూ నవ్వి, ''నీతో వైద్య శాస్త్రం గురించిన చర్చకో, వాదులాటకో వచ్చాననుకోకు. ఇంతకు ముందు నువ్వు ఊరి పొలి మేరల్లో ఉన్న బీడులో ఒకచోట ఎండు పుల్ల గుచ్చావు. అవునా?'' అని అడిగింది.

''అదేం అంత పెద్ద నేరమా? ఏదో తోచక అలా చేశాను.'' అన్నాడు విశ్వ నాథుడు ఎంతో అమాయకంగా ముఖం పెట్టి.

ఆ జవాబుకు భూతం గుడ్లురిమి, ''ఏయ్! నన్నే మోసగించాలని చూస్తు న్నావా? అక్కడ భూమిలో లంకెల బిందె లున్నవని, ఎలాగో తెలుసుకున్నావు. కాని ఒకటి మాత్రం గుర్తుంచుకో! నీకు కనబడిన నిధి నిక్షేపం, నేను నా వారసుడి



కోసం పాతి పెట్టింది. అది నా మనవడు మాధవుడికి దక్కాలి. మరెవళ్లయినా దాన్ని తమదిగా చేసుకోవాలని చూశారో, వాళ్లను సర్వనాశనం చేస్తాను,'' అంటూ హెచ్చరించి మాయమైంది.

భూతం హెచ్చరికకు విశ్వనాథుడు పెద్దగా భయపడలేదు. కాని, ఇప్పుడా యనకొక ధర్మసందేహం కలిగింది. భూతం చెప్పినట్టు, ఒకప్పుడు ఆ భూమి మాధవుడి తాత తండ్రులదే. అయితే, వాడి హయాం వచ్చాక దుబారాతనం వల్ల ఆస్తులన్నీ అమ్మేసి బికారిగా మారాడు.

ఆవిధంగా ఆ బీడు జమీందారు స్వాధీనమైంది. భూతం కోరుతున్నట్లుగా దాని యజమానికి కాక, మాధవుడికి ఆ నిక్షేపం అందజేయాలనడంలో, అంతగా న్యాయం లేదు. మరి ఇప్పుడేం చేయాలి? ఆ రాత్రంతా బాగా ఆలోచించి విశ్వ నాథుడు ఒక నిర్ణయానికి వచ్చాడు.

మర్నాడు ఉదయం ఆయన ఒక కుంచెడు ముడిశెనగలూ, శివలింగం ఒక సంచీలోవేసుకుని, పలుగూ, పారా తీసుకుని బీడులోకి వెళ్ళాడు.

అక్కడ ఎవరూ చూడకుండా, లంకె బిందెలు ఉన్న చోటుకు దూరంగా మూరెడు గుంట తవ్వి, దానిలోశెనగలు పోసి, దాని మీద శివలింగాన్ని పెట్టి మన్నుతో గుంట పూడ్చి తనపాటికి తను ఇంటికి వచ్చాడు.

ఆ సాయంకాలానికి, విశ్వనాధుడు భూమిలో పాతిన శివలింగంలో సగభాగం గుంటలోంచి పైకి వచ్చింది. అది చూసిన వాడొకడు, ఆ వార్త ఊళ్లో చెప్పాడు. వెంటనే జనం బీడులో ఈశ్వరుడు వెలిశాడంటూ పరుగు పరుగున అక్కడికి వచ్చి పూజలు చేయసాగారు.

తన పథకం పారినందుకు, విశ్వనాధుడు చాలా సంతోషించి, నలుగురు గ్రామ పెద్దలను తీసుకుని జమీందారు దగ్గిరకు వెళ్ళాడు.

ఆయన జరిగింది విని ఎంతో ఆనందపడిపోతూ, ''దేవుడు వెలిసిన చోటు, దేవుడిదే అవుతుంది. అక్కడ ఆలయం కట్టేందుకు బీడంతా ఈనాంగా ఇస్తాను. దాంతో పాటు నా తొలి చందా కూడా తీసుకోండి!'' అని డబ్బుతోపాటు, అప్పటికప్పుడే ఈనాం పత్రం కూడా రాయించి ఇచ్చాడు.

విశ్వనాధుడు, పెద్దల సమక్షాన లంకె బిందెలు ఉన్నచోట నుయ్యి తవ్వడానికి మనుషుల్ని పురమాయించాడు. లంకెల బిందెలు బయటపడినై. అందరూ దాన్ని దైవలీలగా భావించారు.

మరొకరెండు మూడు నెలల్లో, లంకెల బిందెల్లో దొరికిన ధనంతో, అక్కడ చక్కని శివాలయం నిర్మించబడింది.

ఆలయ సందర్శనకు వచ్చే వారితో ఆ ప్రాంతం అన్నివేళలా జనంతో సందడిగా ఉండేది. దూరంగా ఉన్న చింతచెట్టు పైనున్న భూతం మొదటి నుంచీ జరిగినదంతా చూస్తూనే ఉంది.

లంకె బిందెలపై తన హక్కుకు శాశ్వతంగా భంగం వాటిల్లినప్పటికీ, అది వైద్యుడి తెలివితేటలకు అబ్బురపడుతూ, ఏమీ చేయలేక ఊరుకున్నది.





## బేతాళ కథలు

# మాయమైన వంటవాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా స్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా ఇంతటి భయంకర వాతావరణంలో నీవు ప్రదర్శించే ధైర్య సాహసాలు నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. నీ ధైర్య సాహసాల వెనుక ఎటువంటి ఆశయమున్నదీ తెలియడం లేదు. ఒక్కొక్కసారి కుముదుడు వంటి సామాన్యుడు కూడా రాజాశ్రయాన్ని వదిలి పెట్టి తన మామూలు జీవితానికి అంకితం కావడంలో ధైర్యసాహసాలు అవసరమవుతాయి. నీకు శ్రమ తెలియకుండా ఉండటానికి కుముదుడి కథ చెబుతాను విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు.

ఒకప్పుడు కళింగ రాజ్యాన్ని అమరసింహుడు పరిపాలించేవాడు. ఇరుగు పొరుగు రాజ్యాలను జయించి, తన



రాజ్యానికి శత్రుపీడ లేకుండా చేసుకు న్నాడు. ఈ క్రమంలో తన మంత్రులకు, కింది అధికారులకు బాధ్యతలు ఒప్ప జెప్పవలసి వచ్చేది. కొంతకాలం తర్వాత, వారు ప్రజావ్యతిరేక నిర్ణయాలు చేపట్టడం మొదలుపెట్టారు. బయట శత్రువులను అణచడంలో తలమునకలైన రాజుకు, తన ఆస్థానంలోని దుర్మార్గుల గురించి తెలిసే అవకాశం లేకుండా పోయింది.

కళింగ రాజ్యంలో కుముదుడు అనే వంటవాడు ఉండేవాడు. అమరసింహుడి పాలనలో బీదా బిక్కీ ప్రజలకు ధర్మసత్రాలు ఏర్పాటయ్యాయి. వీటిలో బీదవారితో బాటు, బాటసారులకు కూడా అన్నపానీ యాలు లభించేవి. అలాంటి ఒకసత్రంలో కుముదుడు వంటపనికి కుదిరాడు.

ఒకసారి కళింగ రాజ్యమంత్రి ఒకరు ఆ ధర్మసత్రంలో భోజనం చేయడం తటస్థిం చింది. వంటకాలు అద్భుతమైన రుచితో నోరూరించాయి. వంట చేసిన వ్యక్తి గురించి ఆ మంత్రి ఆరా తీశాడు. వంట సిబ్బంది తమ ప్రధాన వంటవాడైన కుముదుణ్ణి చూపించి, ''ఇతడి చేతితో పచ్చగడ్డితో పచ్చడి చేసినా అద్భుతమైన రుచి వస్తుంది'' అని చెప్పారు.

అమరసింహుడి వద్ద మెప్పు సంపాదిం చదలిచి, కుముదుణ్ణి అంతఃపుర వంట శాలలో చేర్చాడు మంత్రి.

వంటశాలలో అతడికి ప్రధాన వంట గాడుగా ఉద్యోగమిచ్చారు. అతడి కింద నలుగురు వంటవాళ్లు పనిచేస్తున్నారు. మొత్తం ఐదుగురు కలిసి అంతఃపుర జనా భాకు వండి వార్చవలసి ఉంది. ఈ వంటలు ముగిశాక, కుముదుడు ఒక సహాయ కుడితో పాటు వేరే వంటశాలకు వెళ్లి ప్రత్యే కంగా రాజ కుటుంబం కోసం వంటలు చేయవలసి ఉంది.

మొదటిరోజున మహారాణి కొత్త వంట వాడిని తన వద్దకు పిలిపించుకుని, అంతకు ముందు ఎక్కడ పనిచేశాడో వాకబు చేసింది.

కుముదుడు ఆమెకు తన గురించి వివరించాడు. మహారాణి కోపంతో ఊగి పోతూ ''నిన్ను అంతఃపురానికి తీసుకు వచ్చిన ఉద్యోగి ఎవరూ?'' అంటూ నిల దీసింది. తనను వెంటబెట్టుకు వచ్చిన మంత్రి పేరు చెప్పాడు కుముదుడు. మంత్రి క్షణాలలో మహారాణి ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

మహారాణి ఆయనవైపు కోపంగా చూస్తూ, ''మంత్రిగారూ! అంతఃపుర మర్యాదలు తెలిసి కూడా చివరికి ఒక

ధర్మసత్రంలో పనిచేసే వంటవాడిని తీసుకువచ్చి రాజ కుటుంబానికి ఆహారం వండిస్తారా?'' అంటూ నిలదీసింది.

మంత్రి గాభరా పడిపోయాడు. ఆయన సంజాయిషీ ఇచ్చేలోపు మహారాణి రంకెలు వేస్తూ, ''వందలాది మందికి ధర్మసత్రంలో తూ.. తూ.. మంత్రంగా వండి పడేసే వంటల వాడిని మా జమానాకు చేర్చారంటే మీలో వివేకం నశించింది అనుకుంటాను. మిమ్మల్ని ఏమనుకోవాలో మాకు అర్థం కాలేదు'' అన్నది. మంత్రి కాసేపట్లో తేరుకుని, ''రాణిగారూ, క్షమించాలి. ఈ కుముదుడు వంటలలో నేర్పరి. అతడినేర్పరితనాన్ని నేను స్వయంగా చూసాను కాబట్టి, తమకు మంచివంటకాలు అందజేయగలడని నమ్మి వెంటబెట్టుకు వచ్చాను. ఇతడి చేత మీకు నచ్చిన వంటకం ఒకటి తయారు చేయించుకున్న తర్వాత, ఆ వంటకం నచ్చకపోతే అప్పుడే వెనక్కి పంపించివేద్దాం. ఎంతటి బంగారు పళ్ళేనికైనా గోడచేర్పు అవసరం. అవకాశం దొరక్క ఇతడు మన ధర్మసత్రంలో, వంటవాడిగా చేరాడు. నైపుణ్యానికి తగిన పని దొరికితే తన సత్తా చూపిస్తాడు. ఇతడి నైపుణ్యం మీద నాకు పూర్తి నమ్మకం ఉండ బట్టే కుముదుణ్ణి వెంటబెట్టుకు వచ్చాను. మహారాజు గారి ప్రమేయం లేకుండా నేనే వంటవాడిగా నియమించాను,'' అన్నాడు.

మహారాణి ఆయన మాటలను ఆమోదించి కుముదుడి వైపు తిరిగింది. కుముదుడికి అప్పటికే పై ప్రాణం పైనే పోయినట్టయింది. మహారాణి అతడి స్థితిని గ్రహించి నవ్వి, ''మంత్రిగారు నీమీద చాలా నమ్మకం ఉంచుకున్నారు. వంటింట్లోకి వెళ్లి పాయసం తయారు చేసి పట్టుకురా. నీ ప్రావీణ్యాన్ని మంత్రిగారూ, నేను రుచి చూస్తాం,'' అంది.

కుముదుడికి పోయిన ప్రాణాలు తిరిగొచ్చాయి. వంటశాలలోకి ప్రవేశించి, పొయ్యిమీద పాలు మరిగించి ఒక పద్ధతి ప్రకారంగా దినుసులను కలుపుతూ, ఘుమఘుమలాడే పాయసం తయారు





చేశాడు. వంట ఇంటికి దూరంగా కూర్చున్న మహారాణి మంత్రితో కలిసి వంటశాలలోకి అడుగు పెట్టింది. వంటశాల అంతా సుగంధ ద్రవ్యాల వాసనతో నిండిపోయింది.

కుముదుడు రెండు పాత్రల్లో పాయసాన్ని నింపి రాణివారికి మంత్రిగారికి అందించాడు. రాణి కళ్లు మెరిశాయి. పాయసం నిండా ఆమెకు ఇష్టమైన జీడిపప్పు, ఎండు ద్రాక్ష వంటి దినుసులు నేతితో తయారై అతి మనోహరంగా కనబడుతున్నాయి. రాణీ, మంత్రీ పాయసం అందుకుని రుచి చూశారు.

రాణి ఇంచుమించు మూర్ఛపోయినంత పనిచేసింది. అంతటి రుచికరమైన పాయసాన్ని తన పుట్టింటగాని, మెట్టినింట గాని ఆమె రుచి చూసి ఎరగదు. వెంటనే ఆమె కుముదుడిని ప్రధాన వంటవాడిగా ఆమోదించింది.

వారంరోజుల తర్వాత మహారాజు దేశ పర్యటన నుండి తిరిగొచ్చాడు. మహారాణి దేహంలో మార్పు గమనించాడు. ఆమె ఈ వారం రోజుల్లో నునుపుతేరి నిగనిగలాడుతోంది. అదివరకు ఆమెను అంత కాంతివంతమైన శరీరంతో మహారాజు చూసి ఉండలేదు.

మహారాజు ఆమెను పరామర్శిస్తూ, ''నేను దేశ పర్యటనకు వెళ్లినప్పుడు బెంగతో చిక్కి శల్యమయ్యేదానివి, ఇప్పుడు నీలో కొత్త మెరుపులు గమనిస్తున్నాను కారణమేమిటి మహారాణీ,'' అని అడిగాడు. మహారాణి నవ్వి, ''రాజావారు క్షమించాలి. ఇటీవలే కొత్త వంటవాడిని నియమించాము. అతడు చేసే వంటకాలతో రెట్టింపు ఆహారం తీసుకుంటున్నాను. జిహ్వ చాపల్యాన్ని అణచుకోవాలని చేసే ప్రయత్నాలు అతడి వంటముందు పని చేయడం లేదు,'' అన్నది.

కేవలం వారం రోజుల్లోనే రాణి రూపలావణ్యాలు పెంచగలిగిన వంటవాడి నైపుణ్యాన్ని మహారాజు పరీక్షించదలిచాడు. అయితే త్వరలోనే మహారాజు పరీక్ష తేలిపోయింది. రాజు చెప్పిన ఎటువంటి వంటకాలు అయినా సరే చేసి, ఆయన సంతృప్తి మేరకు అందించేవాడు కుముదుడు. దీంతో మహారాజు కుముదుణ్ణి ప్రత్యేకంగా పిలిచి అభినందించి, అతడికి విలువైన కానుకలిచ్చి, సత్కరించాడు.

ఒకసారి కుముదుడితో బాటు అంతఃపురంలో పనిచేసే తోటమాలి ఒకరు తమ మీద కొద్ది పాటి నిర్లక్ష్యం ప్రదర్శించాడనే సాకుతో మంత్రులు అతడి చెయ్యి నరికించారు. కుముదుడు అతడి ఇంటికెళ్లి పరా

మర్శించాడు. అతడికి పండ్లు అందిస్తూ, ''నీ విధి నిర్వహణలో ఎటువంటి లోటు పాట్లు లేకుండా ప్రవర్తిస్తావు కదా! అటు వంటిది నీకు ఇంత ఘోరమైన శిక్షఎందుకు విధించారు?'' అని అడిగాడు.

తోటమాలి కుమిలిపోతూ, ''మంత్రు లందరూ తమ మాటకు ఎదురులేదని నిరూపించుకోవడానికి ఇటువంటి కఠిన శిక్షలు విధిస్తున్నారు'' అని అన్నాడు.

కుముదుడు ఆశ్చర్యపోయి, ''నీ విష యంలో కక్ష రేగడానికి, అంతకుముందు ఎటువంటి సంఘటనలు జరిగాయి?'' అని అడిగాడు. తోటమాలి గుర్తు తెచ్చు కుంటూ, ''ఒకసారి మహారాణి గారు ఇతర రాజ్యాలనుండి అపురూపమైన పూలమొ క్కలు తెప్పించుకున్నారు. వాటిలో కొన్నిం టిని తనకు రహస్యంగా అందజేయమని, ఈ నలుగురు మంత్రుల్లో ఒకరు నాకు కబురు పెట్టాడు. రాణిగారు తెప్పించుకున్న మొక్కలలో ఏ ఒక్కటి తగ్గినా ఆమె తేలికగా వదిలిపెట్టదు. అందుకే మంత్రిగారి కోరి కను తిరస్కరించాను. అప్పటికి నవ్వి ఊర కున్నారు గానీ ఇంతటి ఘోరం తలపెడ తాడనుకోలేదు'' అన్నాడు తోటమాలి. కుముదుడు అతడిని ఓదార్చి, అతడికి వైద్యం ఖర్చు నిమిత్తం కొంత డబ్బు ఇచ్చి తిరిగి అంతఃపురం చేరుకున్నాడు.

ఆరాత్రి మహారాజు భోజనం చేసిన తర్వాత కుముదుడికి ప్రత్యేకంగా కబురు వెళ్ళింది. మహారాజు అతడిని తన వద్దకు పిలిపించుకున్నాడు. కుముదుడు ఏం జరుగుతుందో ఊహించలేకపోయాడు.



మహారాజు అతడిని పరీక్షగా చూస్తూ, ''ప్రతిరోజూ అద్భుతంగా వంటచేసేవాడివి. పళ్ళెంలో చిట్టచివరి మెతుకువరకూ తిని పించే శక్తి నీకుంది. కాని ఈ రాత్రి నీవు చేసిన వంటకాలలో తేడా వచ్చింది. ఎందువల్ల'' అని అడిగాడు.

వండేవాడికి మనస్సు బాగుండకపోతే వంట పాడవుతుందన్న తెలివిడితో మాత్రమే మహారాజు తనను ప్రశ్నించాడని గ్రహిం చాడు కుముదుడు.

దానితో కుముదుడు ధైర్యం తెచ్చుకుని, ''మహారాజుగారు క్షమించాలి. తమరు ఊహించినట్లు సకారణంగానే వంట మారి పోయింది. నా స్నేహితుడైన తోటమాలి అన్యాయంగా శిక్షకు గురయ్యాడు. అతడి కుడిచేతిని మంత్రులు నరికించారు. ఈ కారణంగా నా మనసు కల్లోలమయింది,'' అన్నాడు.

మహారాజు నివ్వెరపోయి కుముదుడిని అడిగి మొత్తం వివరాలు తెలుసుకున్నాడు.

అప్పటికప్పుడు తోటమాలికి చెయ్యి నరికించిన మంత్రిని పిలిపించి అతడికి కూడా కఠినశిక్ష విధించాడు. దానితో మిగతా మంత్రులకు జ్ఞానోదయమయింది. ఆ నాటి నుంచి పాలనలో మంత్రుల జోక్యాన్ని తగ్గించాడు మహారాజు.

అదే రోజు రాత్రి మహారాజుకు వేడి పాయసం తాగాలనిపించింది. కుముదుడి కోసం కబురు పెట్టాడు. అతడి జాడ ఎవ్వరికీ తెలియలేదు. మహారాజు కుముదుడి కోసం రాజ్యమంతా వెతికించాడు. కుముదుడు అన్న పేరు కలిగిన వాడు ఆయన రాజ్యంలో దొరకలేదు. కుముదుడు తన పేరు మార్చుకుని, వంట వృత్తి మానుకుని, ఒక రైతుగా అదే రాజ్యంలో ఒక మారు మూల గ్రామంలో స్థిరపడ్డాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మహారాజుగారి ఆశ్రయం పొందిన తరవాత కూడా, కుముదుడు ప్రాణభయంతో రాజ్యం విడిచిపెట్టి పారిపోయాడు. మంత్రుల అధికారం తొలిగి పోయాక కుముదుడు తనకు సర్వ సౌకర్యవంతంగా అమరిన ప్రధాన వంటవాడి కొలువు వదులుకుని, కష్టపడి పని చేయవలసిన వ్యవసాయానికి ఎందుకు మారిపోయాడో అర్థం కావడం లేదు. సమాధానం తెలిసి కూడా చెప్పకపోతే నీ శిరస్సు వెయ్యి ముక్కలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కుముదుడు తన వృత్తిని నమ్ముకున్న మనిషి. తన వృత్తితో మహారాజును సంతోషపెట్టిన మనిషి. అతడు ఏనాడూ విలాసవంతమైన జీవితం కోసం ప్రాకులాడలేదు. రాజ్యంలో మంత్రుల అధికారం తాత్కాలికంగా తగ్గినప్పటికీ, మంత్రులు అధికారం రుచి చూసి ఉన్నవారు కాబట్టి, మరో విధానంలో అధికారం చేజిక్కించుకుని ప్రజలను పీడించవచ్చు. ఇక మహారాజు వద్ద తనకు ఎంతగా ప్రాపకం ఉన్నప్పటికీ, కుముదుడు ఆ ప్రాపకాన్ని నమ్ముకోలేదు. ఎటుతిరిగి ఎటు వచ్చినా ఎదుర్కొనే సామర్థ్యం తనకు లేదని గ్రహించి, కుముదుడు తన ఉనికిని మాయం చేసుకుని మారుమూల పల్లెటూరిలో శేష జీవితం గడపాలనుకున్నాడు,'' అని సమాధానమిచ్చాడు. రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

– కొప్పల కాశీవిశ్వేశ్వరరావు





# శ్రీనివాస కల్యాణం-2




## వెంకటాద్రిలో విడిది

అలిగి వెళ్లిపోయిన అర్ధాంగలక్ష్మి వియోగాన్ని విష్ణువు భరించలేకపోయాడు. లక్ష్మి లేని వైకుంఠం నీరులేని సరోవరంలా అనిపిస్తోంది ఆయనకు. ఆమె లేని వైకుంఠ మందిరం దీపంలేని గుడిలా మారింది. ఒంటరిగా వైకుంఠంలోకంలో ఉండలేనని నిర్ణయించుకున్న విష్ణువు శ్రీమహాలక్ష్మి కోసం అన్వేషిస్తూ బయలుదేరాడు.

నాథుడి మీద ఆగ్రహంతో మందిరాన్ని వదిలిన శ్రీమహాలక్ష్మి తన పుట్టినిల్లయిన క్షీరసాగరదరికి చేరకుండా, భూలోకానికి దిగి వచ్చింది. నివసించడానికి అనువైన స్థలం కోసం చూస్తూ, ఉత్తర భారతదేశంలోని కరవీరపురం అనే నగరానికి సమీపంలో ఉన్న అరణ్యం చేరుకుంది. పూలమొక్కలతో, పొదరిండ్లతో, రకరకాల ఫలవృక్షాలతో అందంగా ఉన్న అరణ్యం అది. లక్ష్మి ఆ ప్రశాంత వాతావరణంలో తపస్సు చేయసాగింది.

శ్రీమహావిష్ణువు వైకుంఠం నుండి తిన్నగా భూలోకం చేరుకున్నాడు. విశ్రాంతి అనేది లేకుండా లక్ష్మికోసం వెదకుతూ, అనేక ప్రదేశాలు తిరిగి, చిట్టచివరకు శ్రీకాళహస్తి వద్ద ప్రవహించే సువర్ణముఖి నదికి ఉత్తర దిక్కులో ఉన్న వేంకటాచలం అనే పర్వత ప్రాంతం చేరుకున్నాడు.

వైకుంఠలోకాన్ని వీడి భూలోకంలో అడుగుపెట్టగానే ఆయనను ఆకలిదప్పులూ, అలసటా, పీడించడం ప్రారంభించాయి. భూలోకంలో తిరిగి, తిరిగి అలసిపోయిన

వక్కలంకం సూర్యనారాయణ రావు



విష్ణువు వేంకటాచలం మీద విడిది చేయాలనుకున్నాడు.

కలియుగంలో వేంకటాద్రిగా ప్రసిద్ధి చెందిన ఆ పర్వతం ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క పేరుతో వ్యవహరించబడింది. కృత యుగంలో ఆ పర్వతం పేరు వృషాద్రి. త్రేతా యుగంలో అంజనాద్రి. ద్వాపరయుగంలో శేషాద్రి.. సృష్టి ప్రారంభంలో ఆ పర్వతం పేరు క్రీడాద్రి. వైకుంఠలోకంలో శ్రీమన్నారాయణుడు విహరించే పర్వతం అది. కలి ప్రారంభంలో ఆ వైకుంఠ విహార పర్వతం భూలోకానికి తీసుకురాబడింది. అది ఎందుకు జరిగిందంటే...

బ్రహ్మదేవుడు భూలోకంలో మానవులను సృష్టించాలనుకున్నాడు. అయితే భూలోకం లేదు. సముద్రగర్భంలో మునిగిపోయి ఉంది. దితీ, కశ్యప ప్రజాపతి దంపతుల పుత్రుడైన హిరణ్యాక్షుడనే దైత్యుడు భూగోళాన్ని సాగరగర్భంలో తొక్కి పట్టుకున్నాడు. సముద్రంలోనుంచీ భూగోళాన్ని పైకి లేపి తీసుకువచ్చే శక్తిలేని బ్రహ్మ తన తండ్రి అయిన విష్ణుదేవుని ప్రార్థించాడు.

విష్ణువు శ్వేత వరాహ రూపంలో అవతరించాడు. రెండుకోరలతో తెల్లటి పందిలా ఉన్న తన ఆకారాన్ని పర్వతంలాగా పెంచి, సముద్రంలోకి దూకాడు. భూమండలాన్ని అధీనంలో ఉంచుకున్న హిరణ్యాక్షుడితో భీకరంగా యుద్ధం చేసి, చంపివేశాడు. సమస్త భూ మండలాన్ని తన రెండుకోరల మీద పెట్టుకుని సాగరగర్భంలో నుంచీ పైకి తీసుకువచ్చి, ఒక చోట నిలిపాడు. భూలోకంలో మానవులను సృష్టించమని బ్రహ్మకు చెప్పాడు.

శ్వేత వరాహదేవుడు తాను ఉద్ధరించిన భూమిమీదనే నివసించాలనుకున్నాడు. భూలోకంలో దక్షిణ భారతదేశంలో సువర్ణముఖీ నదికి ఉత్తరాన ఉన్న ఒక సామాన్య ప్రాంతం తన నివాసానికి తగినదిగా గుర్తించాడు. విష్ణురూపంలో ఉన్నప్పుడు తన వాహనమైన గరుడుణ్ణి పిలిచి, వైకుంఠంలో ఉన్న క్రీడా పర్వతాన్ని భూమిమీదకు చేర్చమన్నాడు. గరుత్మంతుడు వైకుంఠ క్రీడా పర్వతాన్ని తన మూపు మీద పెట్టుకుని భూమిమీదకు చేరవేశాడు. భూమికి దిగిన శ్వేతవరాహుడు ఆ క్రీడా పర్వతం మీద నివసించడం ప్రారంభించాడు....

లక్ష్మిని అన్వేషిస్తూ విష్ణువు చేరుకున్నది శ్వేతవరాహమూర్తి రాజ్యమైన క్రీడా పర్వత ప్రాంతాన్నే. ఆ పర్వతం మీద అనేక జాతుల వృక్షాలున్నాయి. పూలమొక్కలున్నాయి. పొదరిండ్లున్నాయి. స్వచ్ఛమైన జలంతో నిండిన పావనమైన పుష్కరిణి కూడా ఉంది.

పుష్కరిణి అనబడే ఆ కోనేరు సమీపంలో విడిది చేయాలనుకున్నాడు విష్ణువు.

నివసించడానికి తగిన స్థలం కోసం వెదికిన శ్రీమహావిష్ణువుకు పుష్కరిణి పడమటి గట్టుమీద చింతచెట్టు కింద ఎత్తైన పుట్ట కనిపించింది. పెద్ద జంతువులు కూడా దూరిపోగలిగినంత పెద్ద పెద్ద రంధ్రాలున్నాయి ఆ పుట్టకు. ఆ పుట్టనే మందిరంగా భావించి, అందులో నివసించాలనుకున్నాడు విష్ణువు. అనుకున్నదే తడవుగా ఒక విశాలమైన రంధ్రంగుండా పుట్టలో ప్రవేశించి, లోపల విశ్రాంతిగా కూర్చుండిపోయాడు...

లక్ష్మీ, విష్ణువూ ఇద్దరూ వెళ్లిపోయిన కారణంగా వైకుంఠం బోసిపోయింది. నారదుడు ఆ విషయాన్ని తన జనకుడైన బ్రహ్మకు చెప్పాడు. శ్రీమహాలక్ష్మి భూలోకంలో కరివీరపుర సమీపాన అరణ్యంలో తపస్సు చేస్తూ ఉన్నట్టూ, శ్రీమహావిష్ణువు దక్షిణ భారతంలో వేంకటాచలం మీద పుట్టలో నివాసం చేస్తున్నట్టూ యోగదృష్టితో దర్శించాడు బ్రహ్మదేవుడు. పుట్టలో దాగిన తన తండ్రి విష్ణువు ఆకలితో అలమటిస్తున్నాడని అన్నాడు బ్రహ్మ నారదుడితో.

''శ్రీహరికి ఆకలిబాధా!'' అన్నాడు నారదుడు ఆశ్చర్యంతో.

''భూలోకం ప్రకృతి సంబంధమైనది. పంచభూతాల ప్రభావం అక్కడ పరిపూర్ణంగా ఉంటుంది. భూవాతావరణంలోకి అడుగుపెట్టగానే ఆకలిదప్పులూ, అలసటా, ఆవేదనా సహజ లక్షణాలుగా సంక్రమిస్తాయి కుమారా!'' అన్నాడు బ్రహ్మ నారదుడి సందేహాన్ని నివృత్తి చేస్తూ.



''అయితే శ్రీమన్నారాయణుని ఆకలి తీరేది ఎలా?'' అన్నాడు నారదుడు.

''పరమశివుడూ, నేనూ, నువ్వూ, శ్రీ మహాలక్ష్మీ కలిసి తరుణోపాయం ఆలోచించాలి. పరమశివుడితో కలిసి, నేడే కరవీరపుర అరణ్యానికి వెళ్దాం!'' అన్నాడు బ్రహ్మదేవుడు...

అనుకున్నట్టే బ్రహ్మదేవుడూ, శివుడూ, నారదుడూ లక్ష్మిని కలుసుకున్నారు. ఆమె కోసం అన్వేషిస్తూ వెళ్ళిన శ్రీమహావిష్ణువు వేంకటాద్రి మీద పుట్టలో చేరి ఆకలితో అలమటిస్తున్న విషయాన్ని ఆమెకు వివరించారు.

''నాధుడి ఆకలి తీరడానికి ఏం చేయాలో చెప్పండి,'' అంది లక్ష్మి.

''సృష్టిలో పాలు సంపూర్ణాహారం. పుట్టలో ఉన్న పురుషోత్తముడికి ప్రతిపూటా పుష్కలంగా పాలు అందించాలి,'' అన్నాడు బ్రహ్మదేవుడు. ''పాలు కావాలంటే పాడి

పశువూ, దూడా అవసరం కద!'' శివుడు సందేహం వెలిబుచ్చాడు.

''మా జనకులు బ్రహ్మదేవులు పాడి ఆవుగా, మీరు దూడగా మారితే సరి! సమస్య తీరుతుంది!'' అన్నాడు నారదుడు.

బ్రహ్మ, శివుడూ అందుకు అంగీకరించారు. వేంకటాద్రి సమీపంలో రాజ్యపాలన చేస్తున్న చోళరాజు దివాణంలో పాడి పశువులు మిక్కుటంగా ఉన్నాయనీ, ఆవుగా మారిన బ్రహ్మను, దూడగా మారిన పరమేశ్వరుడినీ చోళరాజుకు విక్రయిస్తే ఆవూ దూడా అతని ఆలమందలో కలిసి శ్రీహరికి క్షీరం అందిచవచ్చనీ ఉపాయం చెప్పాడు నారదుడు. గోపాలక వేషంలో ఆవునూ, దూడనూ చోళరాజుకు విక్రయించడానికి శ్రీలక్ష్మి సమ్మతించింది.

బ్రహ్మ పాడి ఆవుగా మారిపోయాడు. శివుడు దూడగా ప్రత్యక్షమయ్యాడు. లక్ష్మి గోపాలికగా మారిపోయింది. వాళ్లను చోళ రాజు నగరం వైపు మళ్లించి, నారదుడు వెళ్లిపోయాడు.

లక్ష్మి ఆవునూ, దూడనూ తోలుకుని చోళరాజును కలుసుకుంది. తన ఆవు కామధేనువులాంటిదనీ, పూటకు కడివెడు పాలు ఇస్తుందనీ, పొడవడమూ, తన్నడమూ తెలియని సాధువనీ వర్ణించి చెప్పింది. ఆవునూ, దూడనూ చూసి చోళరాజు భటుల ద్వారా ఆవుదూడలను గోశాలకు తరలించాడు. కామధేనువు లాంటి ఆ ఆవు పాలను నిత్యమూ తన కుమారుడికి త్రాగించాలని ఆజ్ఞాపించాడు.

ఆవూ దూడా కూడా చోళరాజు ఆలమందలో చేరిపోయాయి. అన్ని పశువులతో బాటు గోపాలకుడు ఆ రెండింటినీ మేతకు తోలుకు వెళ్లాడు. ఆలమంద వేంకటాద్రి మీదకు చేరుకుంది. ఆవులన్నీ ఏపుగా పెరిగిన పచ్చికను మేస్తూ ఉండిపోయాయి.

ఆవు రూపంలో ఉన్న బ్రహ్మదేవుడు, విష్ణువు దాగి ఉన్న పుట్టకోసం వెదకసాగాడు. పర్వతం మీద, అరణ్యమంతా వెదకిన అనంతరం పుష్కరిణీ తీరంలోని చాలా పెద్దదైన పుట్టలో విష్ణువు ఉన్నట్లు గ్రహించాడు.

వెంటనే బ్రహ్మగోవు తనపొదుగు నిండుగా చేపిన పాలను ధారాపాతంగా రంధ్రం గుండా పుట్టలోకి వర్షించసాగింది.

విష్ణువు కమ్మటి గోక్షీరాన్ని కడుపారా పానం చేశాడు. ఆయన ఆకలి తీరింది. పొదుగులోని పాలను పూర్తిగా కురిపించిన తరవాత ఆవు ఏమీ ఎరుగనట్లు మందలో కలిసిపోయింది.





# పంచతంత్ర కథలు



రాజకుమార్తె అడిగిన దానికి విష్ణు రూపంలో ఉన్న సాలెవాడు ''ఓ సుదర్శనా, నేను నీకోసమే వచ్చాను. నన్ను కౌగలించుకో'' అన్నాడు. ''స్వామీ మీరు దేవతలు. నేను మనుష్య స్త్రీని. మనకు పొత్తు ఎలా కుదురుతుంది?' అని సుదర్శన అన్నది.

''ప్రియా, నువు నా అర్థాంగి అయిన లక్ష్మివి. నీకు గుర్తు లేదా? శాపవశాన నువు మనుష్యజన్మ ఎత్తటమూ, మనకు కొద్ది కాలం ఎడబాటు కలగటమూ జరిగింది. నేను మానవ రూపంలో కొంత కాలం నీకు భర్తగా ఉన్నమీదట శాపం తీరిపోతుంది. నిన్ను మనుష్య భర్తనుంచి కాపాడటానికి వచ్చాను. మనం గాంధర్వ వివాహం చేసుకుందాం,'' అన్నాడు సాలెవాడు.

రాజకుమార్తె పరమానందం చెంది, అతనికి భార్య కావటానికి ఒప్పుకున్నది. ఇలా చాలా రోజులు వారికి సుఖంగా గడిచాయి. అర్థరాత్రి సమయాన సాలెవాడు తన గరుడ వాహనం మీద రాజకుమార్తె వద్దకు వచ్చి, తెల్లవారబోయే ముందు ఎవరి కంటా పడకుండా తిరిగి వెళ్ళిపోతూ ఉండేవాడు. వెళ్ళే ముందు వాడు రాజకుమార్తెతో తాను వైకుంఠానికి పోతున్నానని, మళ్ళీ రాత్రికి వస్తానని చెప్పేవాడు.

కొంత కాలం గడిచినాక, రాజకుమార్తె చెలికత్తెలు రాజకుమార్తె వద్దకు ఎవరో వచ్చి పోతున్నారని పసికట్టి, రాజుగారు తమ అశ్రద్ధ తెలిసి దండిస్తాడని భయపడి, రాజు వద్దకు వెళ్ళి, ఆయన కాళ్ళమీద పడి, ''మహారాజా, మాకు అభయం ఇయ్యండి, మేము తమరికి ఒక సంగతి మనవి చెయ్యాలి,'' అన్నారు.

''అలాగే ఇచ్చాను. మీరు చెప్పేది చెప్పండి,'' అన్నాడు రాజు. ''మహారాజా మేము రాజకుమార్తె సుదర్శనను వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉన్నప్పటికీ ఎవడో ఆమె వద్దకు వచ్చి పోతున్నాడు. వాడు ఎలా వస్తున్నాడో, ఎలా పోతున్నాడో మాకు తెలియటం లేదు. వాడు మెట్లెక్కి రాజకుమార్తె గదికి పోవడం లేదు: అలా చేస్తే మాకు తెలుస్తుంది. వాడు ద్వారం గుండానూ

రావడం లేదు; అక్కడ కాపలావాళ్లు ఉన్నారు. మేము రాత్రి పదిగంటల దాకా రాజ కుమార్తె వెంటనే ఉండి, ఆమెను పడుకో బెట్టి వచ్చేస్తాం. తిరిగి తెల్లవారు జామున అయిదు గంటలకు ఆమె వద్దకు పోతాం. ఈ మధ్య కాలంలో ఆమె పిలిస్తే తప్ప ఆమె శయన మందిరం వద్దకు వెళ్లం. ఆ వచ్చే వాడు ఆ సమయంలోనే వస్తూ ఉండాలి. ఎలా వస్తాడో, ఎలా పోతాడో ఊహించరా కుండా ఉన్నది. ఇది నిజం. ఆపైన దేవర వారి చిత్తం,'' అన్నారు రాజకుమార్తె చెలి కత్తెలు.



ఈ సంగతి విని రాజు చాలా చింతిం చాడు. గొప్ప వంశంలో పుట్టి కూడా తన కుమార్తె హేయమైన దారి తొక్కింది. ఇందులో తన అశ్రద్ధ ఏమీ లేదు. ఆడ పిల్లను కన్నవారికి అన్నీ అగచాట్లే గద! ఇలా అనుకుంటూ రాజు తన భార్య వద్దకు వెళ్లి, తాను విన్నదంతా చెప్పి, ''ఎవడో దుర్మార్గు డికి ఆయువు తీరిపోతున్నది,'' అన్నాడు.

రాణి లబలబ లాడుతూ తన కుమార్తె మందిరానికి వెళ్లి, ''వంశం చెడబుట్టిన నిర్భా గ్యురాలా, నీ శీలం చెడగొట్టుకున్నావా? నీ వద్దకు వచ్చే అల్పాయుష్కుడు ఎవడు?'' అన్నది. రాజకుమార్తె సిగ్గుతో తల వంచు కుని తల్లికి, నారాయణుడు గరుడ వాహనం మీద తన కోసం వచ్చి పోతున్న వార్త తెలి పింది.

ఈ అద్భుత కథ విని రాణికి అమితమైన ఆనందం కలిగింది. ఆమె గగుర్పాటు చెందుతూ, తన భర్త వద్దకు పోయి, ''మీరు ధన్యులు! మన కులదేవత అయిన నారా యణ మూర్తి ప్రతి రాత్రి మన అమ్మాయి కోసం వస్తున్నాడట. అది లక్ష్మి అవతారమట! వాళ్లిద్దరికీ గాంధర్వ వివాహం జరిగింది. ఇవాళ రాత్రి మనం కిటికీ గుండా నారా యణమూర్తి వారి దర్శనం చేసుకుందాం. ఆ దేవుడు మనలాటి మానవ మాత్రులను పలకరించడనుకోండి! అన్నది.

రాజుకు కూడా అపారమైన ఆనందం కలిగింది. ఆ పగలు ఆయన అతి కష్టం మీద గడిపాడు. రాత్రి అయింది. రాజూ, రాణి కిటికీ వద్ద చేరి, ఆత్రంగా ఆకాశం కేసి చూడసాగారు. శంఖుచక్ర గదాపద్మాలు ధరించి సాలెవాడు గరుడ వాహనం మీద రావడం వారి కంట పడింది. ఆనంద పార వశ్యలో రాజు రాణితో ''ప్రపంచంలో మన కంటే ధన్యులు లేరు. లక్ష్మినే మనం గర్భ వాసాన కన్నాం. సాక్షాత్తూ నారాయణ మూర్తి మనకు అల్లుడయ్యాడు! మన కలలు పండాయి. మన అల్లుడి ప్రతాపంతో నేను ప్రపంచమంతా జయిస్తాను,'' అన్నాడు.

కొంత కాలానికి విక్రమ సేన చక్రవర్తి మనుషులు సుప్రతి వర్మనుంచి కప్పం తీసుకు పోవడానికి వచ్చారు. అప్పుడు శ్రీమన్నారాయణ మూర్తివారి మామగారు కావటం చేత, సుప్రతివర్మ... చక్రవర్తి దూత లకు మామూలు మర్యాదలు చెయ్యలేదు. వాళ్లు ఆగ్రహించి, ''రాజా! కప్పం కట్టే గడువు దాటిపోయినా, నువ్వు ఇంకా కట్ట లేదు. విక్రమసేన మహారాజు ఆగ్రహం కార్చిచ్చులాంటిది. ఏ దేవుడో నిన్ను ఆదు కుంటాడనుకుంటున్నావా?'' అన్నారు.

రాజు వాళ్ల బెదిరింపును ఏ మాత్రమూ లక్ష్యపెట్టలేదు. వాళ్లు చక్రవర్తి వద్దకు వెళ్ళి, తమకు జరిగిన అవమానాన్ని వెయ్యింత లుగా చేసి చెప్పారు. మహారాజు తన సామం తులందరినీ వెంట బెట్టుకుని, పెద్ద సేనతో సుప్రతి వర్మ ఏలే దేశం మీదికి దండయా త్రకు వచ్చాడు. అతడు జనహింస ప్రారం భించే సరికి, బాధితులైన ప్రజలు పుండ్ర వర్ధనానికి వచ్చి, రాజభవనం ముందు ఆక్రోశించారు. అయినా రాజు చలించలేదు.

త్వరలోనే విక్రమసేనుడు పుండ్రవర్ధ నానికి వచ్చి, నగరాన్ని ముట్టడించాడు. మంత్రులూ, పురోహితులూ, నగర ముఖ్యులూ రాజు వద్దకు వచ్చి, తాత్సారం దేనికి అని అడిగారు. రాజు చిరునవ్వుతో, ''విచారించకండి. శత్రువును నిర్మూలించే మార్గం నాకు తెలుసు. రేపు ఉదయాని కల్లా ఈ పని జరగటం మీరే చూస్తారు,'' అన్నాడు.

ఆయన తన కుమార్తె సుదర్శనను పిలి పించి, ఆమెతో మధురంగానూ, గౌరవం గానూ, ''అమ్మా నీ భర్త బలం చూసుకుని నేను శత్రువుతో యుద్ధం తెచ్చుకున్నాను. అందుచేత ఈ రాత్రి వారు నీవద్దకు వచ్చిన ప్పుడు, తెల్లవారేసరికల్లా శత్రునాశనం జరి గేలా చూడు,'' అన్నాడు.

సాలెవాడు ఆ రాత్రి తన వద్దకు వచ్చి నప్పుడు, రాజకుమార్తె అతనితో సంగతి అంతా చెప్పింది. వాడు చిరునవ్వు నవ్వుతూ, ''ప్రియా, హిరణ్యకశిపుణ్ణీ, కంసుణ్ణీ, మధుకైటభులనూ చంపిన నాకు మానవ మాత్రులను చంపటమనగా ఎంత? నా చక్రాయుధంతో శత్రువులను నిర్మూలిస్తా నని నీ తండ్రికి చెప్పు.'' అన్నాడు.

సుదర్శన గర్వంతో ఈ మాట తన తండ్రికి చెప్పింది. మర్నాడు ఉదయానికల్లా విక్రమసేనుడు వధించబడతాడని, ఆయన సొత్తు ఎవరికి దొరికినది వారు ఉంచుకో వచ్చని రాజు నగరంలో చాటింపు వేయిం చాడు. ప్రజలు హర్షించారు.





# వైద్యంలో శాక్యం




సుమేరుపురంలో, విశ్వపతి అనే గొప్ప వైద్యుడు ఉండేవాడు. రోగుల నుంచి పూర్తి వివరాలను నేర్పుగా రాబట్టి రోగ లక్ష ణాలను ఆకళింపు చేసుకుని, అందుకు తగిన చికిత్స చేసేవాడు. తన హస్తవాసి బాగా పేరులోకి రావడంతో రోగులకు అతడిపై మంచి గురి ఏర్పడింది. ఆయన దగ్గిర అనంతుడు, నీలకంఠుడు అనే యువకులిద్దరు శిష్యరికం చేస్తూండేవారు.

అనంతుడు మంచి గ్రహణ, ధారణ శక్తులున్నవాడు. చరకుడు, శుశ్రుతుడు లాంటి మహా మేధావులు వైద్య శాస్త్రాల్లో రాసిందంతా, గుక్కతిరక్కుండా అప్ప చెబుతూ, విశ్వపతిని ఆశ్చర్యపరుస్తూండే వాడు.

విశ్వపతి అతడి తెలివితేటలను మెచ్చు కుంటూ, ఏనాటికైనా అనంతుడు తనను మించిన గొప్ప వైద్యుడు కాగలడని అను కునేవాడు.

అయితే నీలకంఠుడు మాత్రం సామా న్యమైన తెలివితేటలున్నవాడు. కాని, అతడు గురువును అన్ని వేళలా అనుక రిస్తూ, ఆయన రోగులను పరీక్షించే తీరు జాగ్రత్తగా గమనిస్తూండేవాడు. అతడికి వైద్యానికి సంబంధించిన నాలుగు మెళ కువలేవో ఒంటపడితే చాలనీ, ఏదో విధంగా పొట్ట పోషించుకోగలడని, విశ్వ పతి అతణ్ణి గురించి అట్టే పట్టించుకునే వాడు కాదు.

కొంత కాలం అయ్యాక అనంతుడూ, నీలకంఠుడూ విశ్వపతి దగ్గిర తమ చదువు పూర్తి చేసుకుని, స్వస్థలమైన స్వర్ణపురం సంస్థానం చేరుకుని, అక్కడ విడివిడిగా వైద్యవృత్తి ప్రారంభించారు.

కొన్నేళ్లు గడిచాక, ఒకనాడు విశ్వపతిని సంప్రదించేందుకు దీర్ఘవ్యాధితో బాధపడు తున్న ధనికుడొకడు స్వర్ణపురం నుంచి వచ్చాడు. స్వర్ణపురం పేరు వింటూనే

జొన్నలగడ్డ రత్న



విశ్వపతికి, తన శిష్యులైన అనంతుడూ, నీలకంఠుడూ గుర్తుకు వచ్చారు.

విశ్వపతి ధనికుడికి చికిత్స చేస్తూ, వాళ్లను గురించి అడిగాడు. అందుకు ధనికుడు, ''అయ్యా, నీలకంఠుడు ఊళ్ళో వైద్యుడిగా బాగా రాణిస్తున్నాడు. చుట్టుపక్కల ఊళ్ళలోని జనమంతా క్రమం తప్పకుండా తన వద్దకే వచ్చి వైద్యం చేయించుకుంటూ ఉండటంతో అతడి పని మూడు పువ్వులూ ఆరుకాయలుగా ఉన్నది. అయితే, అనంతుడికి మాత్రం వైద్యవృత్తి ఏమాత్రం అచ్చిరాలేదు. అతడు దాన్ని వదిలి, తాతలు మిగిల్చిపోయిన పొలాలు దున్నుకు బతకాలనే ఆలోచనలో ఉన్నాడు,'' అని చెప్పాడు.

ఇది విని విశ్వపతి చాలా ఆశ్చర్య పోయాడు. అనుభవ జ్ఞానంతో, తాను గొప్ప వైద్యుడు కాగలడనుకున్న అనంతుడు, ఎందువల్ల వైద్యుడిగా పేరు తెచ్చుకోలేకపోయాడో, ఏదో రకంగా పొట్ట పోషించుకోగలడనుకున్న నీలకంఠుడు వైద్యుడిగా ఎలా రాణిస్తున్నాడో స్వయంగా తెలుసుకుందామని, అతడు అప్పటి కప్పుడే స్వర్ణపురానికి బయలుదేరి వెళ్లాడు.

విశ్వపతి, మొదట అనంతుడి ఇల్లు చేరేసరికి అతడు లోపల ఎవరో రోగితో మాట్లాడుతున్నాడు. విశ్వపతి లోపలికి అడుగు పెట్టకుండా అక్కడే, తలుపు పక్కనే నిలబడి వారి సంభాషణ వినసాగాడు.

అనంతుడు, రోగితో, ''నీకు వచ్చింది పెద్ద జబ్బేమీ కాదు. కాస్త జలుబు చేసింది, అంతే. ఆ మాత్రానికే ప్రాణం పోతున్నట్లు హైరానపడటం దేనికి? ఇంటికెళ్ళి చిటికెడు పసుపు కొద్దిపాటి మంచి గంధంలో రంగరించి మొహానికి పులుముకుంటే సరిపోతుంది. దీనికి మళ్ళీ మందూ మాకులూ వంటి వాటి అవసరం లేదు. వెళ్లిరా,'' అన్నాడు.

అందుకు రోగి కోపంగా, ''ఈ సంగతి తెలుసుకోవడానికి, మీదాకా రావడం దేనికి? మా అవ్వను అడిగినా చెప్పి ఉండేది, బుద్ధిలేక అనవసరంగా మీ వద్దకొచ్చాను.'' అంటూ తిట్టుకుంటూ వెళ్లిపోయాడు.

రోగి వెళ్లిపోగానే విశ్వపతి లోపలకి వెళ్లాడు. ఉన్నట్లుండి తన ఇంటికి వచ్చిన గురువును చూసి ఆశ్చర్యపడిన అనంతుడు ఆయనకు పాదాభివందనం చేశాడు. విశ్వపతి అతణ్ణి కౌగలించుకుని కుశల

ప్రశ్నలు వేశాడు. అనంతుడు, ''గురు వర్యా, వైద్యం విషయంలో నేను చెప్పే దానిలోనూ, చేసేదానిలోనూ, నాకు తెలిసి నంతవరకూ ఎలాంటి లోపమూ లేదు. అయినా నా చేత వైద్యం చేయించుకోవ డానికి, ఇక్కడి ప్రజలు అంతగా ముందుకు రావడం లేదు, ఎందుకో నాకు కారణం తెలీటం లేదు'' అని చెప్పాడు.

విశ్వపతి మందహాసం చేసి, ''అలాగా! మరి, నీలకంఠుడి మాటేమిటి?'' అని అడిగాడు.

''రోగులు తరచుగా తన వద్దకు వస్తు న్నారు కాబట్టి అతడి పని బాగానే ఉన్నది,'' అన్నాడు అనంతుడు.

''అతణ్ణి కూడా ఒకసారి చూసిపోవాల నుకుంటున్నాను. అతడింటికి వెళదామా,'' అన్నాడు విశ్వపతి. అనంతుడు తలూ పాడు.

విశ్వపతి, అనంతుడూ నీలకంఠుడి ఇంటికి వెళ్ళేసరికి, అక్కడ చాలామంది రోగులు పడిగాపులు కాస్తున్నారు. లోపల నీలకంఠుడు ఒక రోగిని నఖశిఖపర్యంతం శ్రద్ధగా పరీక్షిస్తున్నాడు.

ఆ రోగి అంతకుముందు అనంతుడి దగ్గిరకు వైద్యానికి వచ్చినవాడని, విశ్వపతి చూడగానే గుర్తించాడు. ఆయన లోపలికి వెళ్లకుండా బయట నిలబడి, నీలకం ఠుడు రోగికి వైద్యం చేస్తున్న పద్ధతిని నిశితంగా గమనించసాగాడు.

నీలకంఠుడు రోగితో, ''పడిసెం పది రోగాల పెట్టంటారు. సకాలంలో సరైన




మందు పడకపోతే, అది మరెందులోకో దింపగలదు. అయినప్పటికీ నీకు వచ్చిన భయం ఏమీ లేదు. నా దగ్గిర జలుబు పడిశాలను చేత్తో తీసి పారేసినట్లుగా తగ్గించే బ్రహ్మాండమైన లేపనం ఒకటి ఉన్నది. దాన్ని ఇప్పుడే, నీ ముఖానికి పట్టిస్తాను. క్షణాల్లో తెరిపిన పడతావు,'' అంటూ సమీపంలో ఉన్న కల్వంలోంచి పచ్చగా ఉన్న లేపనం తీసి రోగి ముఖానికి పూసి రుద్దసాగాడు.

అప్పుడు విశ్వపతి, అనంతుడితో మెల్లగా, ''చూశావా అనంతా! ఏదో గొప్ప లేపనం అంటూ నీలకంఠుడు, ఆ రోగికి పసుపుకొమ్ముల్ని మంచి గంధంతో రంగ రించిన ముద్దను ముఖానికి పులుముతు న్నాడు!'' అన్నాడు.

''అంతేకాదు గురువర్యా! జలుబు సామాన్యమైన రోగమనీ, దానికి శాస్త్రంలో ఖచ్చితమైన చికిత్సంటూ లేదనీ తెలిసి కూడా – నీలకంఠుడు అదేదో పెద్ద రోగ

మంటూ చిలవలూ పలవలూ చేసి, రోగికి చెప్పి భయపెట్టడం కూడా నాకు సమ్మతంగా కనిపించడం లేదు, ఇది వైద్య ధర్మానికి విరుద్ధం కాదా!'' అని అన్నాడు అనంతుడు.

విశ్వపతి చిన్నగా నవ్వి, ''నీలకంఠుడు చెప్పిందాంట్లోనూ, చేసిన దాంట్లోనూ ఒక వైద్యుడిగా నాకేమీ తప్పు కనిపించడం లేదు అనంతా,'' అని అన్నాడు.

ఆమాటలకు ఒక్కసారిగా అనంతుడు ఆశ్చర్యపోయాడు.

విశ్వపతి అతడి భుజం తట్టి, ''చూడు అనంతా! కొందరు వ్యక్తులకు తమలో ఏమాత్రం అనారోగ్య చిహ్నాలు కనిపించినా, వెంటనే వైద్యుడి దగ్గరకు పోయి నయం చేయించుకోవాలన్న ఆత్రుత ఉంటుంది. దాన్నే నీలకంఠుడు సొమ్ము చేసుకుంటూ లౌక్యంగా వ్యవహరిస్తున్నాడు.

జలుబుకు వైద్యం కోసం మీ ఇద్దరి వద్దకు వచ్చిన ఇతడు అలాంటి వాడే. అలాంటి వాళ్లతో వైద్యుడు ఊరడింపుగా మాట్లాడడమే కాకుండా, తానివ్వబోయే మందు శక్తివంతమైనదనీ, గుణమిచ్చేదనీ నమ్మకం కలిగించవలసిన అవసరం కూడా ఉన్నది. రోగి మానసిక పరిస్థితిని బట్టి, చికిత్స నిర్ణయించేటప్పుడు వైద్యుడికి ఉపయోగపడేది లౌక్యం గానీ, శాస్త్ర జ్ఞానం మాత్రం కాదు. అందుచేతనే, నీలకంఠుడితో పోలిస్తే, వైద్యశాస్త్రంలో ఎంతో పరిజ్ఞానం ఉన్న నీకు, ఇలాంటి లౌక్యం తెలియక పోవడం వల్లనే, వృత్తిలో అతడి కన్న ఎంతో వెనకబడి ఉన్నావు,'' అన్నాడు.

విశ్వపతి ఇంత చెప్పినమీదట, అనంతుడికి తనలో ఉన్న లోపం కొంతవరకు అర్థమయింది.

తర్వాత ఇద్దరూ లోపలికి వెళ్ళి, నీలకంఠుణ్ణి కలుసుకుని చాలా విషయాలు మాట్లాడారు. విశ్వపతి తన శిష్యుల ఇళ్లలో ఒక్కొక్క రోజు ఆతిథ్యం స్వీకరించి స్వస్థలానికి వెళ్లిపోయాడు.

కొన్నాళ్ల తర్వాత విశ్వపతి స్వర్ణపురం నుంచి, సుమేరుపురానికి వచ్చే పోయే వాళ్లను విచారించి, అనంతుడు కూడా నీలకంఠుడిలా మంచి వైద్యుడుగా పేరు తెచ్చుకున్నాడని తెలిసి ఎంతగానో సంతోషించాడు.





# తథాస్తు దేవతలు



గోపవరం గ్రామంలో నరసింహం అనే చిన్న రైతు ఉండేవాడు. ఆయన భార్య పేరు భానుమతి. నరసింహం నోరెత్తితే తిట్లు వచ్చేవి. పెళ్లయిన కొత్తలో భానుమతి, భర్త తిట్లకు బెదిరిపోయి జ్వరం తెచ్చుకున్నది.

ఒకఏడాది గడిచాక, ఆమె భర్తను అంతగా తిట్టవద్దని బతిమాలింది. నరసింహం కళ్లెర్ర చేసి ''నీ నోరుపడ! మళ్లీ మరోసారి ఇలా అడిగావో ఒళ్లు హూనం చేస్తాను,'' అన్నాడు. భర్త నోటి దురుసును అరికట్టడం తన వల్ల కాదని అర్థమైన భానుమతి, మరెన్నడూ అతడిని ప్రాథేయపడటానికి ప్రయత్నించ లేదు.

తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టడంలో నరసింహం ఘనతను ఊరంతా కథలుగా చెప్పుకునేవాళ్లు.

ఒక సంవత్సరం నవరాత్రి ఉత్సవాలలో, ఊరి మధ్య గల దుర్గగుడి ముందు హరి కథా కాలక్షేపం ఏర్పాటు చేశారు.

ఆ రాత్రి భోజనం వేళప్పుడు నరసింహం భార్యతో, ''ఒసే, జిడ్డుమోహం, త్వరగా వడ్డిస్తే, వెళ్లి కథా కాలక్షేపం చేసి వద్దాం,'' అన్నాడు.

భానుమతి గబగబా భర్తకు వడ్డించింది. నరసింహం భోజనం చేసి, ముందు గదిలో ఉన్న మంచం మీద కూర్చుని, ''త్వరగా తెములు. అవతల కథ మొదలవుతుంది. బద్ధకపు పీనుగా,'' అంటూ కేక పెట్టాడు.

భానుమతి త్వరత్వరగా అన్నం తిని వంటిల్లు సర్దుకోసాగింది. దుర్గగుడి దగ్గర జనం చేసే కోలాహలం ఆగిపోయి హరిదాసు గారి కంచుకంఠం వినిపించసాగింది.

''మనుషులకు నోరు ఉన్నది కమ్మగా తినడానికి, తియ్యగా మాట్లాడటానికి. అంతే కాని, కఠోరంగా తిట్టుకోవడానికి కాదు. తిట్టేముందు మంచి-చెడూ చూసు కోవాలి. తథాస్తు దేవతలు ఉంటారు. వాళ్లు తథాస్తు అంటే, మనం తిట్టిన తిట్లన్నీ

**25 ఏళ్ళనాటి చందమామ కథ**



నిజంగా జరిగిపోతాయి. అందువల్ల, సాధ్య మైనంత వరకు మనిషన్నవాడు మంచే మాట్లాడాలి!''

నరసింహానికి హరిదాసు మాటలు విని పించాయి కాని వాటి సారాంశాన్ని ఏ మాత్రం తలకెక్కించుకోలేదు.

అతడు మంచం మీదనుంచి లేచి ''ఇంకా వంటగదిలోనే అఘోరిస్తున్నావా, మొద్దూ'' అంటూ భార్యను కసిరాడు. ''ఇదుగో, మొహం కడుక్కుని వచ్చేస్తాను,'' అంటూ భానుమతి బావి దగ్గరనుంచి జవాబి చ్చింది.

''నీ మొహం మండ! ఎప్పుడూ ఆల స్యమే,'' అన్నాడు నరసింహం.

ఆ మరుక్షణం పెరట్లో నుంచి ఘొల్లు మంటూ శోకాలు ప్రారంభించింది, భాను మతి.

''మొహం మండిపోతున్నది, బాబోయ్! భరించరాని మంటలు దేవుడోయ్!'' అంటూ ఆమె మొహం మీద నీళ్లు చల్లు కుంటూ కేకలు పెట్టసాగింది.

భానుమతి మొహం మంట ఎంతసేప టికీ తగ్గక పోయేసరికి, నరసింహం ఆమెను వెంటబెట్టుకుని దగ్గిరలో ఉన్న వైద్యుడిం టికి వెళ్లాడు.

''ఆయన భోజనం చేస్తున్నారు. ఇప్పుడే వస్తారు, కూర్చోండి!'' అన్నది వైద్యుడి భార్య.

భార్యాభర్తలిద్దరూ అరుగుమీద కూర్చు న్నారు. భానుమతి మోహం మంట భరించ లేకపోతున్నది. పదీ పదిహేను నిమిషాలు గడిచినా వైద్యుడు బయటకి రాలేదు.

అది చూసి నరసింహం మండిపడుతూ, భార్యతో, ''వీడు వైద్యుడా, బకాసురుడా! ఎంతసేపు తింటాడు? త్వరగా బయటకి వచ్చి కూలబడడేం,'' అన్నాడు.

ఆ మరుక్షణం వైద్యుడు గబగబా బయ టికి వచ్చి, అరుగుపక్కన కూలబడి మూల గసాగాడు. వైద్యుడి భార్య శోకాలు ఆరం భించింది.

నరసింహం భార్యను తీసుకుని మరొక వైద్యుడి ఇంటికి వెళ్లాడు. ఆ వైద్యుడు భానుమతి మోహంలోకి చూసి నరసిం హంతో, ''ఒక పాతిక రూపాయలివ్వు!'' అన్నాడు.

నరసింహం తెల్లబోయి, ''ముందు రోగిని పరీక్షించండి,'' అన్నాడు.

వైద్యుడు మౌనంగా, అక్కడ గోడకు వేళ్లా డుతున్న ఒక చెక్కబల్ల కేసి వేలు చూపి, అవతల ఏదో ముఖ్యమైన పని ఉన్న వాడిలా తిన్నగా ఇంట్లోకి వెళ్లిపోయాడు.

ఆ చెక్క బల్లమీద ఇలా రాసి ఉన్నది: రోగిని చూస్తే పాతిక రూపాయలు. పరీక్ష చేస్తే యాభై, చికిత్సకు వంద.

నరసింహం జేబులోంచి పాతిక రూపాయలు బైటికి తీస్తూ, ''ఏడి అమ్మ కడుపు కాల! వైద్యాన్ని వ్యాపారం చేశాడు,'' అంటూ కోపంతో పళ్లు కొరుక్కున్నాడు.

ఇంతలో వైద్యుడు వచ్చి, పాతిక రూపాయలు తీసుకుని, భానుమతిని పరీక్షించబోతూండగా, లోపలి నుంచి ఆయన తల్లి, ''ఒరే బాబూ త్వరగా రా! ఇక్కడ నా కడుపు పెనంలా కాలిపోతున్నది.'' అంటూ కేక పెట్టింది.

ఆ కేక వింటూనే వైద్యుడు ఒక్కసారిగా లోపలికి పరిగెత్తాడు. నరసింహం ఒక పావు గంట చూసి, భార్యతో, ''వీడు వైద్యుడో, వ్యాపారో తెలియడం లేదు. మరొక చోటుకు వెళదాం పద'' అంటూ జేబులో మిగిలిన నలభై రూపాయలను తీసి చూసుకుని అక్కడి నుంచి బయలుదేరాడు.

నరసింహానికి, అతడి స్నేహితుడు శేషాచలం ఎదురుపడ్డాడు. వైద్యానికి మరి కొంత డబ్బు అవసరం అవుతుందేమో అనుకుంటూ, నరసింహం, స్నేహితుణ్ణి ఆపి, ''నీ దగ్గరేమన్నా డబ్బుంటే ఇవ్వు. తెల్లవారగానే తెచ్చి ఇస్తాను,'' అన్నాడు.

శేషాచలం బాధపడుతున్న వాడిలా ముఖం పెట్టి, ''చాలా అవసరం అయి అడిగుంటావు. కాని సమయానికి, నా దగ్గర దమ్మిడీ లేదు,'' అని ముందుకు సాగాడు.



''డబ్బు ఉండీ, మనకు లేదంటున్నాడు, దొంగవెధవ!'' అన్నాడు నరసింహం భార్యతో.

ఆ మరుక్షణం శేషాచలం వెనుతిరిగి వచ్చి, నరసింహం మెడపట్టుకుని, ''నీ దగ్గిర ఉన్న డబ్బంతా ఇచ్చెయ్యి. అలా చేయకపోయావో, నీ ప్రాణానికే ముప్పు,'' అన్నాడు గట్టిగా పళ్లు కొరుకుతూ.

నరసింహం వణికిపోతూ, తన దగ్గిర ఉన్న డబ్బును శేషాచలానికి ఇచ్చి వెళ్లాడు.

భానుమతి ఇదేమీ పట్టించుకోకుండా, ''నా మొహం మండిపోతున్నది బాబో!'' అంటూ అరవసాగింది.

ఆసరికి బాగా విసిగిపోయి ఉన్న నరసింహం, భార్య భుజం గట్టిగా పట్టుకుని, ''మరొక దిక్కుమాలిన వైద్యుడెవడైనా దొరుకుతాడేమో అని నిన్ను తీసుకుపోతున్నాను, ఊరికే అరవకే రాక్షసీ!'' అన్నాడు.

ఆ వెంటనే భానుమతి రాక్షసిగా మారిపోయింది. ఆమె వికృత రూపాన్ని చూసి హడలిపోయిన నరసింహం కెవ్వుమంటూ

అరచి పరిగెత్తసాగాడు. రాక్షసి రూపంలో ఉన్న భానుమతి, అతడి వెంటబడి తరమ సాగింది. ఆవిధంగా వాళ్లు ఊరు దాటి ఒక మామిడితోట లోంచి పరుగెత్తుతూండగా, నరసింహం వెనుదిరిగి చూశాడు. అతడికి భార్య కనిపించలేదు. ఇద్దరు దేవతలు అతడి కేసి వస్తూ కంటబడ్డారు.

నరసింహం భయాశ్చర్యాలతో ''ఎవరు మీరు?'' అని వాళ్లను అడిగాడు.

''మేము తథాస్తు దేవతలం!'' అన్నారు వాళ్లు.

ఇంతవరకూ, తను తిట్టిన తిట్లన్నీ ఒక్కటి తప్పకుండా నిజం కావడానికి కారణమే మిటో నరసింహానికి ఇప్పటికి అర్థమైపో యింది.

అతడు దూరంగా తనకేసి పరుగెత్తి వస్తున్న రాక్షసిని వాళ్లకు చూపుతూ, ''నా తప్పులను క్షమించండి. ఇక నోటికి వచ్చిన తిట్లన్నీ తిట్టడం మానుకుంటాను. నా మీద దయచూపి నా భార్యకు, ఆ రాక్షసి రూపం నుంచి విముక్తి కలిగించండి!'' అంటూ తథాస్తు దేవతల కాళ్లమీద పడ్డాడు.

''తథాస్తు! నీ భార్యకు రాక్షసిరూపం నుంచి విముక్తే కాదు. ఈ క్షణం నుంచి రాక్షసుడి లాంటి భర్త నుంచి కూడా విముక్తి కలిగింది. ఉత్తపుణ్యానికి తిట్టేవాళ్లంటే, ఎదుటివాళ్లకు భయం ఉండొచ్చుకాని, గౌరవం, ప్రేమాలాంటివి ఉండవు. ఆ సంగతి బాగా గుర్తుంచుకో!'' అంటూ తథాస్తు దేవతలు మాయం అయారు.

రాక్షసి రూపం పోయిన భానుమతి, భర్త దగ్గరకు వచ్చి, ''మీరెందుకిలా దిక్కులు చూస్తూ వణికిపోతున్నారు? మనం ఊరు విడిచి-ఇంతదూరంలో ఉన్న మామిడీతోటలోకి, ఈ అర్ధరాత్రి వేళ ఎందుకు వచ్చాం?'' అని అడిగింది ఆశ్చర్య పోతూ.

''అదంతా తర్వాత చెబుతాలే, ముందు ఇంటికి వెళదాం పద,'' అంటూ నరసింహం మౌనంగా ఇంటివైపు బయలు దేరాడు.

తను అడిగిన దానికి, ''నోరు మూయవే దరిద్రపుగొట్టుదానా!'' అని భర్త తిట్టనం దుకు మురిసిపోతూ, భానుమతి భర్త వెంట నడిచింది.





# ఇల్లు పట్టిన భూతం



ఒక ఊళ్లో మల్లయ్య అనే గాజుల వర్తకుడు ఉండేవాడు. అతను ఊరి చివర పెద్ద స్థలంలో చిన్న పూరిల్లు కట్టుకుని అందులో తన భార్యా బిడ్డలతో కాపురం ఉండేవాడు. ఈ స్థలమూ, ఇల్లూ కాక గాజుల మల్లయ్యకు గల ఆస్తి మొత్తం మీద ఒక ఆవూ, దూడా, కోళ్లూనూ.

మల్లయ్య రోజూ ఉదయాన్నే లేచి, ఆవుకు పాలు తీసి, గడ్డివేసి, చద్ది అన్నం తిని, మధ్యాహ్నానికి అన్నం మూట కట్టుకుని గాజుల బేరం మీద ఊళ్ళమీదకి బయలుదేరేవాడు.

సాయంకాలం దాకా ఆ పల్లే ఈ పల్లే తిరిగి గాజులమ్మి చీకటి పడే వేళకు ఇంటికి చేరుకునేవాడు. గాజుల మన్నిక, మల్లయ్య మాట తీరుతో ప్రతి ఊరిలోనూ జనం విశ్వాసం చూపి బేరాల పేరుతో మల్లయ్యను పీడించేవారు కాదు.

ఒక రోజు గాజుల మల్లయ్య యధా ప్రకారంగా మలారం మోసుకుంటూ ఒక మర్రి చెట్టు దగ్గరికి చేరేసరికి మధ్యాహ్నమయింది. దగ్గరిలోనే బావి కూడా ఉన్నది.

తిరిగి తిరిగి అలిసిపోయిన మల్లయ్య తన మలారం చెట్టు కింద దింపుకుని, చెంబుతో నీళ్లు తెచ్చుకుని, తన అన్నం మూట విప్పి, తిన్నంత తిని, మిగతాది ఏ కుక్కలో తినేస్తాయి గదా అని చెట్టుకిందనే వదిలేసి మలారం భుజానికెత్తుకుని ముందుకు సాగిపోయాడు.

మల్లయ్య కదిలాడో లేదో ఒక బ్రహ్మరాక్షసి అటుగా వచ్చింది. అది లోగడ ఉంటూ వచ్చిన చెట్టు పడిపోవడం చేత, కొత్త నివాసం ఏర్పాటు చేసుకునేటందుకు ఈ మర్రి చెట్టును చూసి వచ్చింది.

అక్కడ అనుకోకుండా దానికి గాజుల మల్లయ్య వదిలిపెట్టిన అన్నం కనిపించింది. బాగా ఆకలిగా ఉండటాన అది ఆ అన్నమూ, పచ్చళ్లూ ఆవురావురు



మంటూ తినేసింది. అంతవరకూ బ్రహ్మ రాక్షసి పచ్చి మాంసమూ, పచ్చినెత్తురూ తప్ప మరొక దాని రుచి చూడలేదు. ఇప్పుడు దానికి మనుషులు తినే ఆహారం ఎంత రుచిగా ఉంటుందో తెలిసి వచ్చింది.

ప్రతి రోజూ ఇలాంటి తిండే తింటూ మనిషిలాగా బతకాలన్న బలమైన కోరిక దానికి కలిగింది. దాంతో గాజులమల్లయ్య కోసం ఎదురు చూస్తూ అది అక్కడే ఉండిపోయింది.

ఆ రోజుకు బేరం ముగించుకుని మల్లయ్య ఆ దారినే తిరిగి వస్తూ, పొద్దు గుంకే వేళకు మర్రి చెట్టు దగ్గిర మలారం దించి, బావి దగ్గిర మంచి నీళ్లు తాగుతూ ఉండగా ఎవరో ఆడకూతురు బోరున ఏడుస్తున్న ధ్వని వినిపించింది.

మల్లయ్య తల తిప్పి వెనక్కు చూసే సరికి మర్రి చెట్టు మొదట ఒక ఆడ మనిషి కూచుని ఏడుస్తూ ఉండటం కనిపించింది.

''ఎవరమ్మా నువ్వు? ఇక్కడ ఒంటరిగా ఏడుస్తున్నావెందుకు?'' అని మల్లయ్య అడిగాడు.

''మాది చాలా దూరం, బాబూ! సంసారం మోయలేక నా భర్త నన్ను విడిచి పెట్టి ఎటో వెళ్లిపోయాడు. తిండీతిప్పలూ లేక చాలా బాధపడుతున్నాను,'' అన్నదా స్త్రీ.

''అయ్యో, పాపం! అలాగైతే మా ఇంటికి వచ్చి మాకు పని సహాయంగా ఉండు. నీకు ప్రత్యేకంగా జీతం ఏమీ ఇవ్వలేను గాని, ప్రతి రోజూ కడుపునిండా తిండి పెడతాను. తరవాత నీ భర్త జాడ తెలిస్తే వెళ్లిపోదువు గాని,'' అన్నాడు మల్లయ్య.

బ్రహ్మరాక్షసికి కావలసింది కూడా సరిగ్గా అదే గనక, ''బాబూ, నా చేతనైన పని ఏదన్నా చెప్పి చేయించుకోండి. ఒకే ఒక షరతు. చేతకాని పని చెబితే మాత్రం నేను మీ ఇంట ఒక్క క్షణం కూడా ఉండను. ఎందుకైనా మంచిది. ముందే చెబుతున్నాను.'' అన్నది.

సరేనని మల్లయ్య, ఆడ మనిషి రూపంలో ఉన్న ఆ బ్రహ్మరాక్షసిని తన వెంట తీసుకెళ్లాడు. అతని భార్య ఆ మనిషి వృత్తాంతమంతా భర్త నుంచి వివరంగా విని, ''నీ పేరేమిటమ్మా?'' అని అడిగింది.

''నా పేరు దయ్యమ్మ,'' అన్నది బ్రహ్మ రాక్షసి ఏ మాత్రం తడుముకోకుండా.

సరే, మర్నాటి నుంచి దయ్యమ్మ

మల్లయ్య ఇంట పని ప్రారంభించింది. పొద్దున్నే లేచి వాకిళ్లు ఊడ్చి, నీళ్లు చల్లేది. మల్లయ్య పాలు తీయగానే ఆవునూ, దూడనూ తీసుకుపోయి మధ్యాన్నం దాకా మేపుకొచ్చేది.

మిగిలిన రోజల్లా మల్లయ్య భార్యకు ఇంట్లో అన్ని పనులలోనూ సహాయం చేసేది. ఆమె వ్యవహారం ఎవరికీ ఎలాంటి అనుమానం కలిగించలేదు.

ఒకనాటి రాత్రి మల్లయ్య బేరాలు ముగియకపోవడంతో చాలా పొద్దుపోయి ఇంటికి వచ్చి తలుపు తట్టాడు. అప్పటికే ఇంటిల్లిపాదీ అన్నాలు తిని, చలికి ముసుగులు తన్ని పడుకున్నారు. మల్లయ్య భార్య మంచం మీద పడుకున్నది. దయ్యమ్మ నేల మీద చాప వేసుకుని పడుకుంది.

మల్లయ్య భార్య ముసుగులో నుంచి బయటకు రావడం ఇష్టం లేక, ''ఆయన వచ్చినట్టుంది. కాస్త తలుపు తియ్యి, దయ్యమ్మా!'' అన్నది.

దయ్యమ్మ ఒక్క మూలుగు మూలిగి, గాఢనిద్రలో, తానెక్కడున్నదీ మర్చిపోయి చాప మీద పడుకుని ఉండే, చెయ్యి పొడుగ్గా చాచి తలుపు గడియ తీసింది. ఇది కాస్తా మల్లయ్య భార్య కంటపడనే పడింది. ఆమె పై ప్రాణాలు పైనే పోయినంత పని అయింది.

ఆమె తన భయాన్ని ఎలాగో అణచుకుని మర్నాటి ఉదయం, రాత్రి జరిగిన విడ్డూరం గురించి తన భర్తతో చెప్పేసి ''ఇది



మనిషి కాదు, దాని పేరే విడ్డూరం! దయ్యమ్మ అని ఎవరన్నా పేరు పెట్టుకుంటారా? మీరేం చేస్తారో నాకు తెలీదు. ఈమెను వెంటనే ఇంటి నుంచి సాగనంపండి. పిల్లలున్న ఇంట్లోకి నేరకపోయి దయ్యాన్ని తీసుకొచ్చి పెట్టారే. ఊళ్ళో వాళ్ళకు ఈ విషయం తెలిస్తే మనకేగతి పడుతుందో ఆలోచించారా?'' అన్నది.

మల్లయ్య తన భార్య మాటలు మొదట నమ్మలేదు. కాని తనకు కూడా లోపల అనుమానంగానే ఉన్నది. తాను లోపలికి వచ్చేసరికి దయ్యమ్మ చాప మీద పడుకునే ఉన్నది. తలుపు గడియ తీసి వెళ్లి పడుకోవడానికి తగిన వ్యవధి లేదు. దయ్యమ్మ మనిషి అయినా కాకపోయినా తన భార్య భయపడుతున్నది గనక ఆమెను పంపెయ్యాలనే మల్లయ్య నిశ్చయించాడు. కాని అకారణంగా వెళ్ళిపొమ్మంటే తమకు మర్యాదగా ఉండదు. అయితే చేతగాని పని చెబితే పోతానని దయ్యమ్మ మొదటనే

చెప్పింది. అందుచేత ఆమెను పంపటానికి మల్లయ్య ఒక ఎత్తు ఎత్తాడు.

ఒకరోజు మల్లయ్య దయ్యమ్మతో, ''చూడు దయ్యమ్మా, మన ఇంటి చుట్టూ బోలెడంత ఆవరణ ఉన్నది. ఇందులో ఎన్నో చెట్లు వేసుకోవచ్చు. అయితే ముందుగా నిలువెత్తున ప్రహరీ గోడ కట్టాలి. కాస్త ఆ పని చూడు!'' అన్నాడు.

దయ్యమ్మ అంతపని తన వల్ల కాదనక, సరేనని తానే మట్టి తవ్వి, ఇటుకలు చేసి, కాల్చి, ఒంటరిగా ఆవరణ చుట్టూ ఎత్తయిన ప్రహరీ గోడ కట్టేసింది.

ఆ తరవాత ఎక్కడెక్కడినుంచో పెద్ద పెద్ద చెట్లు తెచ్చి ఆవరణ అంతటా పాతి తోట తయారు చేసింది. దయ్యమ్మ మామూలు మనిషి కాదని మల్లయ్యకు రూఢి కావటమే గాక ఊళ్లో వాళ్లందరికీ కూడా తెలిసిపోయింది. ఈ దయ్యమ్మను ఎలా వదుల్చుకోవాలో మల్లయ్యకు పాలుబోలేదు.

దయ్యమ్మ ఎవరికీ ఏ అపకారమూ చెయ్యటం లేదు. నిజమే. కాని అటువంటి మనిషి ఇంట ఉండటం ఎంత ప్రమాదం! ఊళ్లో వాళ్లంతా విషయం తెలిసిపోయి ఆ దయ్యం ముండను వెళ్లగొడతావా, లేక నువే ఊరు విడిచి పోతావా? అని అతణ్ణి అడుగుతున్నారు. మల్లయ్య ఇంటి చుట్టూ అస్తమానం జనం మూగుతున్నారు.

అవకాశం రానే వచ్చింది. ఒకనాడు మల్లయ్య కుటుంబమంతా ఆవరణలో ఉండగా పిల్లి ఒక ఎలుకను తరుముకుంటూ వచ్చింది. ప్రాణభయంతో ఎలుక పరిగెత్తుకుంటూ వెళ్ళి ఒక సన్నటి కలుగులో దూరింది.

ఇదంతా చూస్తున్న మల్లయ్య కొడుకు పసివాడు, ''దయ్యమ్మా, దయ్యమ్మా! ఆ ఎలుకను తీసుకురా!'' అని అడిగాడు ఎంతో ఉత్సాహంగా.

'''ఏం? నాకు చాతకాదనుకున్నావా?'' అంటూ దయ్యమ్మ అందరూ చూస్తుండగానే ఎలుకంత చిన్నదైపోయి కలుగులోకి దూరింది.

ఇదే సమయమనుకుని మల్లయ్య గంపెడు మట్టి తెచ్చి ఆ కలుగును పూడ్చేశాడు. అంతే, ఆ తరువాత దయ్యమ్మను ఎవరూ చూడలేదు.



# వేగానికి కారణం

ఒకరాజు, సభలో ఉన్నవాళ్లను, ''సృష్టిలోని ప్రాణులన్నింటిలోకీ వేగమైనదేది?'' అని అడిగాడు.

సభికులు రకరకాలుగా సమాధానాలు చెప్పారు కాని, రాజుకమేపీ తృప్తి కలిగించలేదు.

అప్పుడు విదూషకుడు లేచి, ''నాకు తెలిసినంతవరకూ, నన్ను మించి వేగంగా పరిగెత్త గల ప్రాణి సృష్టిలో లేదు. నేనొకసారి పరుగుపందెంలో, ఒకలేడిని, కుందేలును గుర్రాన్ని ఓడించాను, అన్నాడు.

రాజు కోపంగా విదూషకుడివంక చూసి, 'నేనడిగేది ప్రగల్భాలు కాదు. వాస్తవమైన సమాధానం,'' అన్నాడు.

''నేచెప్పింది నిజమే ప్రభూ! ఆ సమయంలో నేనంత వేగంగా పరిగెత్తడానికి కారణం లేకపోలేదు-- నన్నొక పిచ్చికుక్క తరుముకున్నది.'' అని చెప్పాడు విదూషకుడు.

సభికులూ, రాజు కూడా పెద్దగా నవ్వారు. అప్పుడు విదూషకుడు వినయంగా, ''ప్రాణికి సహజంగా ఉండే వేగం వేరు, పిరికితనం ప్రసాదించే వేగం వేరు. ఈవిషయం ప్రభువులు ఒప్పుకోకపోవడానికి కారణం, పిరికితనమంటే ఏమిటో తెలియకపోవడమే!''

సభికులు హర్షధ్వానాలు చేశారు. రాజు చిరునవ్వు నవ్వి, విదూషకుడికి విలువైన బహుమతి ఇచ్చారు.

- కొప్పరపు నాగేశ్వరరావు





# పులి స్వారీ



చిత్రదుర్గం రాజు ఆనంద వర్ధనుడు మృగయా వినోదార్థం దండకారణ్యంలో విడిది చేశాడు. గిరిజన నాయకుడు సంజీవకుడు, తన కుటుంబం, పరివారంతో రాజు విడిది చేసిన గుడారానికి వచ్చి, అడవిలో దొరికే పుట్టతేనె, వివిధ రకాల తైలాలు, జంతు చర్మాలు, ఏనుగు కొమ్ములు కానుకలుగా సమర్పించుకున్నాడు.

సంజీవకుడి కూతురు బామిని అందగత్తె. రాజుకి ఆమెపై మనసైంది. బామినిని పెళ్లి చేసుకుని రాజధానికి తీసుకెళ్లాలని అనుకున్నాడు. సంజీవకుడి గూడేనికి మంత్రిని రాయబారానికి పంపించాడు.

రాజుగారు అల్లుడవుతాడంటే ఏ తండ్రయినా ఎగిరి గంతేస్తాడు. ఆనందంగా ఒప్పుకుంటాడు. కాని సంజీవకుడు ససేమిరా అన్నాడు. ''మంత్రిగారూ, ఇది మహారాజుకు తగని కోరిక. నా కూతురు చిన్నపిల్ల. పదహారేళ్ల కన్య. రాజుగారు వృద్ధుడు. ఎంతో వయసు తారతమ్యం ఉంది. నేను ఈ పెళ్లికి ఒప్పుకోను.'' అని నిర్మోహమాటంగా చెప్పాడు సంజీవకుడు.

మంత్రికి కూడా రాజు కోరిక అనౌచిత్యంగా తోచింది కాని రాజాజ్ఞను అనుసరించి సంజీవకుడి దగ్గరికి వచ్చాడు.

''సంజీవకా! రాజు బలవంతుడు. నీ కుమార్తెను బలవంతంగా ఎత్తుకెళ్లి వివాహం చేసుకుంటే ఏం చేస్తావు,'' అన్నాడు మంత్రి. సంజీవకుడు నవ్వి, ''నా కంఠంలో ప్రాణం ఉండగా అంతపని జరగనివ్వను. రాజుకి ఎదురు తిరిగి యుద్ధం చేస్తాను.'' అన్నాడు.

మంత్రి, సంజీవకుడితో మంతనాలాడుతుండగా బామిని పులిమీద స్వారీ చేసుకుంటూ ఇంటికి వచ్చింది. మంత్రిని చూసి గాండ్రించింది. మంత్రి హడలిపోయాడు. ''సంజీవకా! నీ కూతురు సామాన్యురాలిగా కనిపించడం లేదు. అపరదుర్గలా ఉంది. పులిమీద స్వారీ చేయడం మామూలు మనిషికి సాధ్యం కాదు.'' అన్నాడు

సంజీవకుడు నవ్వి, ''మంత్రిగారూ! ఆ పులి పసిపిల్లగా ఉన్నప్పుడు నా కూతురికి అడవిలో దొరికింది. అప్పటినుంచి పాలు

వాణిశ్రీ

పోసి పెంచింది. అది కూడా నా కూతురితో పాటు పెరిగి పెద్దదైంది. మనుషులతో మచ్చికైంది. గూడెంలో ఎవరి జోలికీ రాదు. కొత్తవారిని చూస్తే భయపెడుతుంది అంతే!'' అన్నాడు.

మంత్రికి తన కర్తవ్యం ఏమిటో బోధ పడింది. ''సంజీవకా! రాజుతో తలపడి నువ్వు నెగ్గలేవు. జన నష్టం తప్ప ఎదిరించి సుఖం లేదు. గూడెంలో అందరినీ చంపి నీ కూతుర్ని తీసుకెళ్లగలడు రాజు. ఉపాయం తోనే రాజు మనసు మార్చాలి. నేను చెప్పి నట్లు చెయ్యి.'' అని ఒక ఉపాయం చెప్పాడు మంత్రి.

సంజీవకుడు మర్నాడు కొమ్ము బూరలు ఊదుకుంటూ, డప్పులు వాయిస్తూ రాజు విడిది చేసిన గుడారానికి చేరుకున్నాడు. అతని వెంట పెద్దపులి కూడా గాండ్రిస్తూ వారిని అనుసరించింది.

సంజీవకుడు మహారాజుకి నమస్క రించి ''రాజా! మీరు నా అల్లుడవడం ఎంతో గర్వకారణం. సామాన్య గిరిజన యువతిని పెళ్లాడటం మీ ఉదార బుద్ధికి, గొప్పతనా నికి నిదర్శనం. మా గూడెంలో కొండదేవర సమక్షంలో వివాహానికి అన్ని ఏర్పాట్లు చేశాను. మీరిక దయచేయండి.'' అన్నాడు.

రాజు సంతోషించి పల్లకీ సిద్ధం చేయమని మంత్రిని ఆదేశించాడు.

''రాజా! పెళ్లి మా ఆచారం ప్రకారం జరుగుతుంది. అందుకు మీరు సమ్మతిం చాలి.'' అన్నాడు సంజీవకుడు

''అలాగే మాకు అభ్యంతరం లేదు.'' అన్నాడు రాజు సంతోషపడుతూ.

''తమరు ఈ పులిమీద ఎక్కి ఊరేగిం పుగా కొండ దేవర సమక్షానికి చేరుకోవాలి.'' అన్నాడు సంజీవకుడు.

రాజు పులిమీద స్వారీ అనగానే హడలిపో యాడు. తను ఎంత ధైర్యవంతుడయినా, చేతిలో ఏ ఆయుధం లేకుండా పులి మీద ఎక్కడం ప్రమాదం అని తోచింది.

రాజుని చూసి పులి భయంకరంగా గాండ్రిస్తోంది. ఈ వయసులో పులిని ఎక్కే సాహసం చెయ్యడంవృధా అని తోచింది రాజుకి.

''ఈ పులిమీద ఊరేగింపు నాకు ఇష్టం లేదు. ఈ పెళ్లి కూడా నాకు వద్దు. మీరు ఇక వెళ్లవచ్చు.'' అన్నాడు సంజీవకుడితో.

తమ పథకం పారినందుకు మంత్రి, సంజీవకుడు సంతోషించారు.



# శిథిలాలయం - 7




(శిఖిముఖీ, విక్రమకేసరీ తిమ్మగూడెం వెళ్లారని కబురందగానే, శివాలుడు కొందరు అనుచరులతో ఆ గూడేనికి వెళ్లాడు. అతడు చేరేసరికి శిఖిముఖి, సవరగండపోతును ఈటెతో పొడిచి వడ్లపాతరలో పడవేశాడు. గండుపోతు అనుచరులు, శిఖిముఖి మీదికి వచ్చేంతలో శివాలుడు వాళ్లను ఆయుధాలు కిందపడవేయమని హెచ్చరించాడు. తరవాత-)

సవరగండపోతు గాయపడి వడ్లపాతరలో పడిపోగానే, అతడి అనుచరులకు నాయకత్వం వహించిన సవరుడు, శివాలుడి హెచ్చరిక విని తాను పెద్ద చిక్కులో తల దూర్చానని గ్రహించాడు. ఇప్పటి పరిస్థితుల్లో పోరుకు దిగడం అంటే సర్వనాశనం కావటమే; అలా అని శివాలుడికి లొంగిపోతే- ఇక సవరపల్లెల్లో తనకూ, తమ నాయకుడికీ మానమర్యాదలు దక్కవు...

సవరుడు ఇలా ఆలోచించి, శివాలుడి కేసి తిరిగి పెద్ద గొంతుతో, ''మీరు మమ్మల్ని అన్ని వైపుల నుంచి చుట్టుముట్టారు. మా కన్న మీరు రెండు మూడింతలు అధిక సంఖ్యలో ఉన్నారు. ఇది న్యాయం కాదు. మీరు చేసేది ధర్మయుద్ధం అనిపించుకోదు.'' అన్నాడు. ఆ మాటలు వింటూనే శిఖిముఖి సవరుడి కేసి తీవ్రంగా చూసి, ''ప్రతిదానికీ న్యాయం, ధర్మం అంటూ వెకిలిగా మాట్లాడటం, మీరు ఆ శిథిలాలయ పూజారి దగ్గిర్నుంచి నేర్చుకున్నట్టుంది. డబ్బుకాశపడి పరాయి చోటినుంచి వచ్చిన మంత్రాల పోతు పూజారికి సహాయపడటం న్యాయం, ధర్మం అవుతుందా? ఈ తిమ్మగూడెం మీద పడి ధాన్యం దోచుకుంటున్నారే, ఇదేరకం ధర్మం? ఇక అట్టే మాట్లాడక ఆయుధాలు కింద పడేయండి,'' అన్నాడు.

''ఒకసారి మేం నిరాయుధులం అయిం

దాసరి సుబ్రహ్మణ్యం

తరవాత, మమ్మల్నందరినీ మీరు ఈటెల్తో పొడిచి చంపరని హామీ ఏమిటి?'' అన్నాడు సవరుడు.

''అదంతా మా దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటుంది. ఇంతకూ మీరు చప్పున ఆయుధాలు అవతల పారేస్తారా? లేక...'' అంటూ శిఖిముఖి, విక్రమకేసరి వెంట ఉన్న శబరయువకుల కేసి చూశాడు.

శిఖిముఖి మాటల ధోరణిని అలాగే కొనసాగిస్తే, అనవసర రక్తపాతం జరుగుతుందని భయపడి, శివాలుడు తన చేతిలో ఉన్న ఈటెను దూరంగా విసిరివేస్తూ, ''మీ సవరల్లో ఏ ఒక్కరికీ హాని జరగదని నేను మాట ఇస్తున్నాను. కావాలంటే ఆయుధాలు దగ్గరే ఉంచుకోండి, నా అభ్యంతరం లేదు. నాక్కావలసిన వాడు శిథిలాలయ పూజారి. వాడే నాకు ప్రబల విరోధి. ఇంతకూ మీ నాయకుడు గండుపోతెక్కడ?'' అని అడిగాడు, సవరల నాయకుడుగా మాట్లాడిన వాణ్ణి. ''ఇక్కడ! ఇక్కడ! వడ్లపాతర అడుగున పడున్నాను. గాయం నుంచి నెత్తురు వరదలై పారుతున్నది. కళ్లు బైర్లు తిరుగుతున్నై,'' అంటూ అరిచాడు సవర గండుపోతు పాతర్లో నుంచి.

శివాలుడు ఆశ్చర్యంగా ఆ మాటలు వినిపించిన వైపుకు చూసి, గబగబా వడ్ల పాతర దగ్గిరకు పోయి, లోపలకు తొంగి చూశాడు. గండుపోతు పాతర మధ్య కూర్చుని తల ఎత్తి శివాలుడి కేసి చూశాడు.

''గండుపోతూ! ఏమిటిది? గాయపడ్డావా? త్వరగా పైకి ఎక్కిరా. ఆ శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు నీ సహాయం కావాలి,'' అన్నాడు శివాలుడు.




''పైకెక్కి రాగలిగితే ఎప్పుడో వచ్చి ఉండే వాణ్ణి. ఈటె పోటు తిని కుడిచేయి చచ్చుపడి పోయింది. ఎడమకాలి కీళ్లిరిగినట్లు అనుమానం. ఇంత చేసిన వాడెవడో తెలుసా? నీ కొడుకు శిఖిముఖి! వాడు ధైర్యసాహసాల్లో కత్తి, ఈటే సాముల్లో నా అంతటివాడు. వాడికి ఈడొచ్చిన నా కూతురు నాగుమల్లిని ఎందుకు చేసుకోకూడదు? ఏమంటావు, శివాలూ?'' అన్నాడు గండుపోతు పకపక నవ్వుతూ.

ఈ అసందర్భపు మాటలు వినగానే, ఎత్తునుంచి పడటం వల్లా, గాయం నుంచి రక్తస్రావం జరగటం వల్లా గండుపోతుకు మతి చలించి ఉంటుందనుకున్నాడు శివాలుడు. ఆ వెంటనే అతడు తన అనుచరుల్ని హెచ్చరించి ఒక కొయ్యపలక తెప్పించి, దాని చివర్లకు తాళ్లు కట్టించి ఇద్దర్ని పాతర్లోకి దింపాడు. వాళ్లిద్దరూ గండుపోతును కూర్చున్న చోటు నుంచి ఎత్తి కొయ్యపలక మీద పడుకోబెట్టారు. పాతరపైనున్న వాళ్లు,

గండుపోతును మాటులో పడ్డ అడివి జంతువును పైకి లాగినట్లు తాళ్లసాయంతో పైకి లాగారు.

గండుపోతు తన అనుచరుల కేసి చూసి, ఆశ్చర్యపడుతూ, ''మన వాళ్లందరి దగ్గిరా ఆయుధాలున్నయ్యే! ఇంతకీ ఇక్కడ గెలిచిందెవరు? మన వాళ్లెందరు చచ్చారు?'' అని ప్రశ్నించాడు. సవరలకు నాయకత్వం వహించిన వాడు గండుపోతు ముందుకు వచ్చి, ''దొరా! శబర శివాలు దొర ఇక్కడ రక్తపాతం జరక్కుండా ఆపారు,'' అన్నాడు.

అనుచరుడలా చెప్పగానే గండుపోతు శివాలుడి కేసి తిరిగి, ''నేను మీ జాతివాళ్లకు చాలా అన్యాయం చేశాను. పూజారి కుక్క నాకు బంగారం ఆశ చూపి, నా చేత పాడు పనులు చేయించాడు, నన్ను క్షమించు,'' అన్నాడు వణుకుతున్న గొంతుతో.

''జరిగిందేదో జరిగింది, ఇద్దరం మరిచి పోదాం. ముందు నీ కాలికీ, చేతికీ కట్టు కట్టనీ, తరవాత ఆ పూజారి వేట అందరం కలిసి ప్రారంభిద్దాం,'' అని చెప్పి, శివాలుడు అంత దూరాన నిలబడి చూస్తున్న వృద్ధుడొకణ్ణి దగ్గిరకు పిలిచి, ''ఈ సవరజాతి పెద్దకు వెంటనే చికిత్స చెయ్యి,'' అన్నాడు.

ఆ వృద్ధుడు గ్రామవైద్యుడు. అతను తన వైద్యపరికరాలను ఎప్పుడూ సంచిలో పెట్టుకుని భుజానికి వేలాడదీసుకుని తిరుగుతుంటాడు. అతడు గండుపోతు చేతి గాయం మీద ఏదో ఆకుపసరు పిండి, అవే ఆకుల్ని కట్టుగా కట్టాడు. తరవాత గండుపోతు ఎడమకాలిని వేళ్లతో పట్టి చూసి, ఇద్దరు సవరుల్ని గండుపోతు చేతులు పక్కలకు పట్టుకోమని చెప్పి, రెండు వెదురు




బద్దల్ని అతడి మోకాలుకు పైనా కిందా పెట్టి, తాడుతో గట్టిగా బిగించి ముడేశాడు. వైద్యుడిది చేసేప్పుడు గండుపోతు బాధతో గిలగిల్లాడిపోతూ, ''ఇంత బాధకూ కారకుడు ఆ పూజారి కుక్క! వాడిచ్చిన బంగారు ఇటుకల్ని మహానదిలో పారెయ్యండి. వాణ్ణి ఈడ్చుకొచ్చి, టేకుమాను చితారుకొమ్మన ఎండగట్టండి!'' అంటూ అరిచాడు.

కట్టు కట్టడం కాగానే గ్రామ వైద్యుడు లేచి నిలబడి, గండుపోతు ముఖంలోకి తీక్షణంగా చూస్తూ, ''గండుపోతూ, వైద్యుడిగా నా ధర్మమేదో నేను చేశాను. ఇప్పుడు చెప్పు, మా గ్రామం నుంచి దోచుకుపోయిన ధాన్యం మాకు తిరిగి ఇవ్వదలిచావా, లేదా?'' అని ప్రశ్నించాడు.

''వాళ్లు ఎత్తుకుపోయింది బహు కొద్ది ధాన్యమే. అంతా ఎత్తుకుపోకుండా శిఖిముఖి పులిగండులా వచ్చి పడ్డాడు. మా వాళ్లు ఎత్తుకుపోయిన ప్రతి బస్తా ధాన్యానికి రెండు బస్తాల మా సొంత ధాన్యం చేర్చి, మీ



గ్రామ పాతర్లో పోయిస్తాను,'' అని చెప్పి, గండుపోతు తన అనుచరులతో, ''బస్తాలుగా కట్టి ఉన్న ధాన్యమంతా పాతర్లో పోయండి. మన వాళ్లు గూడెం దాటించిన ప్రతి బస్తాతోనూ, మరి రెండు బస్తాల ధాన్యం మన పల్లె నుంచి ఇక్కడికి తీసుకురండి,'' అన్నాడు. తన నాయకుడు ఇలా ఆజ్ఞాపించగానే, సవరలు కొందరు తమ పల్లెకేసి బయలు దేరబోయారు. గండుపోతు వాళ్లను ఆపి, ''పూజారి కుక్క, తన గుహవదిలి అరణ్యంలో తిరుగుతూండవచ్చు. ఒకవేళ మీకెదురుపడి అడిగితే, ఇక్కడ మన సవరులందరూ, శబర శివాలుడికి ఖైదీలుగా చిక్కిపోయారని చెప్పండి,'' అన్నాడు.

తరవాత గండుపోతును శివాలుడు ఇద్దరి చేత గ్రామచావడిలోకి మోయించుకు పోయాడు. గ్రామచావడిలో శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ ఒకపక్కగా కూర్చున్నారు. గండుపోతు తన అనుచరులు పరిచిన జంతుచర్మాల మీద గోడకు చేరగిలబడి కూర్చున్నాడు. శివాలుడు ప్రశ్నించిన మీదట అతడు, శిథిలాలయ పూజారి వారం రోజుల క్రితం తమ పల్లెకు రావటం, లంచంగా చాలా బంగారం ఇచ్చి, విక్రమకేసరి నుంచి తాళపత్ర గ్రంథం సంపాయించి తనకివ్వమని అడగటం గురించి చెప్పాడు.

''శివాలూ, కేవలం వాడిచ్చిన వెధవ బంగారం కోసమే, నేనిన్ని పాడుపనులు చేశాననుకోకు. వాడు నాకు మహత్తరమైన మంత్రాలు నేర్పి, నన్ను ఈ అరణ్య రాజ్యానికి మహారాజును చేస్తానన్నాడు. వాడింతకీ కావాలనే ఆ తాళపత్ర గ్రంథం రహస్యం ఏమిటి?'' అని ప్రశ్నించాడు గండుపోతు.

''అది నువ్వడగవలసిన ప్రశ్న కాదు గండుపోతూ, ఒక విధంగా నాకు ఆ తాళపత్రాల్లో ఉన్న రహస్య విషయాలేమిటో పూర్తిగా తెలియవు. అదలా ఉంచుదాం. ఈ శిథిలాలయ పూజారి, ఈ ప్రాంతాలనుంచి స్వేచ్ఛగా తిరిగి, బ్రహ్మపుత్రానదీ లోయలకు పోవడం, మున్ముందు కొన్ని చిక్కులకు దారితీస్తుంది. వాణ్ణిక్కడే పట్టుకుని హత మార్చాలి. ప్రస్తుతం వాడు దాగి ఉన్న కొండ గుహఎక్కడ?'' అని అడిగాడు శివాలుడు.

గండుపోతు, శిఖిముఖి కేసి తల తిప్పి, ''మీ శిఖికి ఈ చుట్టుపక్కల ఉన్న అరణ్యం, కొండలూ క్షుణ్ణంగా తెలిసినవే కదా, శిఖీ! నందికొండ దిగువున ఉన్న తాటితోపు నీవెరిగే ఉంటావు. ఆ తోపుకు దక్షిణపు అంచున ఒక అయిదు తలల తాటిచెట్టు ఉన్నది. ఆ తాటిచెట్టెక్కి అన్నిటికన్న ఎత్తుగా ఉన్న తలమీంచి చూస్తే, ఆ పూజారి గాడు ఉంటున్న గుహ సూటిగా కనబడుతుంది.

ఆ గుహ పక్కన మరి కొన్ని గుహలు ఉన్నవి కనుక, ఆ దుర్మార్గుడున్న గుహను గుర్తించ డానికి ఇదొక్కటే మార్గం,'' అన్నాడు.

''ఆ గుహ ముందు కావలి వాళ్లెవరైనా ఉన్నారా?'' అన్నాడు శిఖిముఖి.

''గుహ ముందు లేరు, తాటి తోపులో మా వాళ్లు ఇద్దరు ముగ్గురున్నారు. నీకు సహాయం చేయమని వాళ్లకు ఇప్పుడే కబురు పంపుతాను,'' అన్నాడు గండుపోతు.

శివాలుడి అనుమతి పొంది, శిఖిముఖీ, విక్రమ కేసరీ నలుగురు అనుచరులను వెంట బెట్టుకుని నందికొండ కేసి బయలు దేరారు. అవసరం రావచ్చున్న నమ్మకంతో శిఖి ముఖి విల్లంబులు వెంట బెట్టుకుపోయాడు. వాళ్లు నందికొండను చేరేసరికి సూర్యుడు బాగా పడమటికి వాలాడు. తాటి తోపులో ఉన్న గండుపోతు అనుచరులు తమ నాయ కుడి నుంచి ముందే వార్త అంది ఉండ టంతో, శిఖిముఖినీ, విక్రమకేసరినీ అయి దుతలల తాటి చెట్టున్న చోటకు తీసుకు పోయి, ''మీరు తాటిచెట్టెక్కి చూడండి. పూజారి గుహలోనే ఉన్నాడు. రెండు మూడు గంటల సేపు నుంచీ ఎందుకనో గుహంతా కలయతిరుగుతున్నాడు. గుహలో అంతగా వెలుగు లేక పోవడంతో, వాడేం చేస్తున్నదీ స్పష్టంగా తెలియడం లేదు,'' అని చెప్పారు.

శిఖిముఖీ, విక్రమకేసరీ సంప్రతించు కున్నారు. విక్రమకేసరి కొందరు అనుచరు లతో గుహ దగ్గిరకు పోయేట్టూ, ఒకవేళ పూజారి వాళ్లు రావటం చూసి పారిపోయేం దుకు ప్రయత్నిస్తే, శిఖిముఖి చెట్టుమీది నుంచీ బాణం వదలి వాణ్ణి చంపటమో, గాయపరచటమో చేసేట్లూ నిర్ణయించుకు న్నారు. పావుగంట తరవాత విక్రమ కేసరి కొండ ఎక్కి గుహను సమీపించేంతలో, అప్పటి వరకూ గుహలో నీడలో అటూ ఇటూ తిరుగుతున్న పూజారి ఆకారం, ఒక్కసారిగా ఎగిరి గంతేసినట్లు, చెట్టుమీ దున్న శిఖిముఖికి తోచింది. పూజారి పారి పోయే ప్రయత్నం చేస్తున్నాడని భావించి, శిఖిముఖి గురి చూసి బాణం వదిలాడు. బాణం దెబ్బ తగలగానే, గుహలో ఉన్న ఆకారం బాధతో ఎలుగుబంటిలా ఒక్క సారి గోండ్రించింది.

ఆ గోండ్రింపు వింటూనే విక్రమకేసరీ, అతడి వెంట ఉన్నవాళ్లూ, గుహకేసి వేగంగా పరిగెత్తారు. ''పూజారి ఎలుగ్గొడ్డుగా మారాడు!'' అనుకుంటూ శిఖిముఖి చెట్టుమీంచి దిగి, గుహకేసి పరుగుతీయ సాగాడు. *- (ఇంకా ఉంది)*



# ఆవాజ్ దో
## (ఇప్పుడే మాట్లాడండి)

ప్రియమైన పాఠకులారా,

ఈ నెల మీకోసం ఒక విశిష్టమైన ఆన్‌లైన్ కేంపెయిన్-అవాజ్‌దో(ఇప్పుడే మాట్లాడండి) కార్యక్రమాన్ని తీసుకువస్తున్నాము. www.awaazdo.in వెబ్‌సైట్ సందర్శించి విద్యా హక్కుపై సమాచారాన్ని వ్యాప్తి చేసేందుకు ప్రతిజ్ఞ చేయండి.

నాణ్యమైన విద్యను పొందటం అనేది ఈ భూమ్మీది ప్రతి శిశువు యొక్క అత్యంత ప్రాథమిక హక్కులలో ఒకటి. విద్య లేకుండా ఏ శిశువు కూడా వ్యక్తిగా లేదా సమాజంలో సభ్యుడిగా అతడి లేదా ఆమె సమర్థతల స్థాయికి చేరుకోలేదు. ప్రపంచ యవనిక మీద అడుగు పెట్టదలచిన దేశానికి విద్య అనేది ప్రస్తుతం తప్పనిసరి అవసరం.

2009 ప్రారంభంలో భారత ప్రభుత్వం, ఉచిత, నిర్బంధ విద్యా (ఆర్‌టిఇ) చట్టం 2009లో పొందుపర్చిన చారిత్రక హక్కును ఆమోదించింది. ఇది ప్రతి పిల్లవాడి విద్యా హక్కుకు భద్రత కలిగించింది కాబట్టి భారతీయ పిల్లలకు ఇదొక చారిత్రక క్షణం.

ఉచిత, నాణ్యమైన విద్యను పొందడానికి పిల్లలకు గల హక్కు గురించి ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. దీనిని సఫలీకృతం చేయడానికి మనమంతా కలిసి ప్రయత్నం చేయాలి.

మొదటి దశ ఏదంటే పిల్లల హక్కుల గురించి సాధారణంగాను, విద్యా హక్కు గురించి ప్రత్యేకంగాను ప్రతి ఒక్కరూ తెలుసుకునేలా చేయాలి. విద్యా హక్కు గురించి, ఉచిత, నాణ్యమైన విద్యపై దాని హామీ గురించి మనం తెలుసుకున్నట్లయితే పాఠశాలకు వెలుపల ఉన్న పిల్లలందరికీ విద్య అందించే లక్ష్యానికి మనం మరింత చేరువవుతాం.

ఇప్పుడు సమయం ఆసన్నమైంది. మన స్వరాలను పెంచుదాం పదండి. ఈ మాటను గట్టిగా పలుకుతూ మన చుట్టూ వ్యాపింపచేద్దాం. మీ స్వరం ఉద్యమానికి అవసరమైన కదలికను తీసుకువస్తుంది.

మీ చుట్టూ ఉన్న కుటుంబం, మిత్రులు, వారి మిత్రులు అందరికీ ఈ విషయం తెలియజేయండి. ప్రతి పాపా, బాబూ ఉచిత, నాణ్యమైన విద్యా హక్కును కలిగి ఉన్నాడని మనలో ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి.

మీరు ఈ విషయమై ఎలాంటి సహాయం చేస్తారో తెలుసుకోండి. నేటి పిల్లల తరపున ఛాంపియన్‌గా మారడానికి మీరే ముఖ్యంగా నడుం కట్టండి. భారత్‌లో పాఠశాలకు వెలుపలే ఉన్న 80 లక్షల మంది పిల్లలు ఇక ఎంతో కాలం వేచి ఉండ లేరు.



ఇప్పుడే.. మరెన్నడో కాదు.. ఇప్పుడే...! మాట్లాడండి...!

ప్రియ పాఠకులారా, ఈ ప్రచారం ప్రాథమికంగా డిజిటల్ రూపంలో ఉంటుంది, ఆన్‌లైన్‌లో www.awaazdo.inలో మీరు ప్రతిజ్ఞ చేయాలి కనుక ఆ వెబ్‌సైట్‌లోని కొన్ని పుటలను మీకోసం ఇక్కడ తిరిగి ప్రచురిస్తున్నాము. ఆన్‌లైన్ ప్రతిజ్ఞను చేపట్టండి, దాన్ని మీ ఫేస్ బుక్‌లో ఉంచండి లేదా సులువుగా ఈమెయిల్ చేసి మీ అభిప్రాయం కాస్త జతపర్చండి!

Welcome Praveen

awaaz do

Speak up for every child's right to education

HOME | GET THE FACTS | SPREAD THE WORD | GO BEYOND WORDS | PARTNERS | DONATE

facebook

START
**SPEAKING NOW**
TO MAKE A DIFFERENCE

To make a difference, we need as many people as possible talking about the right to education. Every message, Every email, Every tweet and Every status update makes a difference.

**SMS YOUR FRIENDS**
Send a free text message to all your friends. Tell them why you support the right to education

**E-MAIL YOUR CIRCLE**
E-mail everyone you know to tell them about the Awaaz Do movement and how they can help

**WRITE A BLOG**
Get the Awaaz Do Blogger's Kit and tell your readers about the children who are denied their basic right to an education and what they can do about it
Download Blogger's Kit

**DONATE YOUR STATUS**
On Facebook for the Awaaz Do movement

After telling people about Awaaz Do, find out what else you can do to support it.

unite for children

unicef

JOIN THE CONVERSATION

UNICEF INDIA | PRIVACY POLICY | FEEDBACK | SITEMAP

Welcome Praveen

awaaz do

Speak up for every child's right to education

HOME | GET THE FACTS | SPREAD THE WORD | GO BEYOND WORDS | PARTNERS | DONATE

facebook

THE DREAM OF AN INDIA WHERE EVERY
**CHILD IS EDUCATED AND FREE**
TO LIVE A HAPPY CHILDHOOD
IS NOW POSSIBLE

**WHAT IS THE RIGHT OF CHILDREN TO FREE AND COMPULSORY EDUCATION (RTE) ACT 2009?**
Know what RTE is all about and why is it so important for the children of India and for the future of our country.

**KNOW AWAAZ DO**
Learn about Awaaz Do and why you should be a part of it.

**FACT-SHEET**
Take a look at some key facts about children and education in India.

**RTE FAQS**
Find answers to your most burning questions about the RTE.

**AWAAZ DO CARD**
Click on the deck, get an interesting RTE fact. Share it with friends.

**RTE ACT**
Download the RTE Act

Now that you know RTE and its significance, start speaking now.

unite for children

unicef

JOIN THE CONVERSATION

UNICEF INDIA | PRIVACY POLICY | FEEDBACK | SITEMAP







## కొన్ని వాస్తవాలు

**బడికి దూరమైన పిల్లలు:** బడికి దూరమైన పిల్లల సంఖ్య 2003లోని 25 మిలియన్ల నుంచి 2009 మధ్యనాటికి 8.1 మిలియన్ల మందికి పడిపోయింది. వీటిలో గుర్తించదగిన పరిణామాలు బీహార్, జార్ఖండ్, మణిపూర్, చత్తీస్‌ఘర్‌లలో చోటు చేసుకున్నాయి. జన సాంద్రత అధికంగా ఉన్న ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్, ఒరిస్సా బీహార్ వంటి రాష్ట్రాలలో బడికి దూరమైన పిల్లల శాతం ఆందోళన కలిగిస్తుంది.

**సామాజిక చేర్పు:** పాఠశాలలో సామాజికంగా వెనుకబడిన బృందాల పిల్లల శాతంలో గణనీయమైన వృద్ధి కనబడుతున్నప్పటికీ సామాజిక అంతరం మాత్రం కొనసాగుతోంది. ఈరోజుకీ బాలురతో పోలిస్తే పాఠశాలలో నమోదవుతున్న బాలికల సంఖ్య తక్కువగానే ఉంటోంది. లైంగిక అంతరం ఎస్టీలలో 12.6 పాయింట్లు ఉండగా, ఎస్సీలలో 16 పాయింట్ల వ్యత్యాసంతో ఉంటోంది.

వీటికి తోడుగా, 8 సంవత్సరాలపాటు నిరవధికంగా పాఠశాల విద్య పొందడంలో ఎస్టీ, ఎస్సీ పిల్లలు ఇప్పటికీ వెనుకబడే ఉన్నారు.

## మీకు తెలుసా?




**ఉపాధ్యాయులు:** ప్రతి 30 మంది విద్యార్థులకు కనీసం ఒక అర్హత పొందిన, శిక్షణ పొందిన ఉపాధ్యాయుడిని కలిగి ఉండవలసిన హక్కు పిల్లలకు ఉంది. ప్రస్తుతం, జాతీయ సగటు ప్రకారం 34 మంది పిల్లలకు ఒక టీచర్ ఉంటున్నారు. కాని జార్ఖండ్, మధ్యప్రదేశ్, పశ్చిమబెంగాల్ వంటి రాష్ట్రాల్లో ఒక టీచర్ 60 మందికి పైగా విద్యార్థులకు పాఠం చెబుతున్నాడు.

ఈ అంతరాన్ని పూరించడానికి ఇప్పటికిప్పుడు దాదాపు 1.2 మిలియన్ మంది అదనపు ఉపాధ్యాయులను నియమించవలసిన అవసరముంది. ప్రస్తుతం ప్రతి 5 ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులలో ఒకరికి కనీస విద్యార్హతలు లేవు. ఇలాంటి స్థితిలో నాణ్యమైన విద్య పొందే పిల్లల హక్కును నిలబెట్టడం కష్టం.

**పారిశుధ్యం:** వందలో 84 పాఠశాలలకు భారత దేశ వ్యాప్తంగా తాగునీటి సౌకర్యం ఉంది. కాని అరుణాచల్ ప్రదేశ్, అస్సాం, మేఘాలయ రాష్ట్రాల్లో సగానికి సగం పాఠశాలలకు ఈ సౌకర్యం లేదు. భారత్‌లోని వంద పాఠశాలల్లో 65 పాఠశాలలకు ఉమ్మడి మరుగుదొడ్లు ఉన్నాయి: అయితే అరుణాచల్ ప్రదేశ్, అస్సాం, చండీఘర్, ఢిల్లీ, జమ్మూ-కాశ్మీర్, జార్ఖండ్, ఒరిస్సా, రాజస్థాన్ రాష్ట్రాలలో నాలుగింటికి ఒక పాఠశాలలో మాత్రమే ఈ సౌకర్యం ఉంది.




వంద పాఠశాలల్లో యాభై నాలుగు బళ్లలో బాలికలకు వేరు మరుగుదొడ్లు ఉన్నాయి. సగటున అస్సాం, మేఘాలయ, మణిపూర్ రాష్ట్రాలలో తొమ్మిదింటికి ఒక పాఠశాలలో మాత్రమే ఈ సౌకర్యం ఉంది. బీహార్, చత్తీస్‌ఘర్, జమ్మూ-కాశ్మీర్, జార్ఖండ్ మరియు ఒరిస్సాలలో నాలుగింటికి ఒక పాఠశాలలో మాత్రమే బాలికలకు ప్రత్యేకంగా మరుగు దొడ్లు ఉన్నాయి.

ఈ కథనం మీకు నచ్చిందా? మీ అభిప్రాయాలు మాకు పంపండి!

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందమామ ప్రియ పాఠకుల అభిప్రాయాలు వినాలని మాకు కుతూహలంగా ఉంది. మీ వ్యాఖ్యలను/కథనాలను మాకు పంపండి. www.awaazdo.in, **Email:info@msfraipur.org**





# పరివర్తన




చక్రవర్తి అజయ సింహుడు ఆ రోజు చాలా కుషీగా ఉన్నాడు. రాజ్‌పూర్ సంస్థానాధీశుడు అతడిని నిలువెత్తు బంగారంతో తూచి దాన్ని అతడికి సమర్పించాడు. రాజ్యంలోని ప్రజలు కూడా అతడిని ఎంతగానో అభిమానించే వారు. కొద్దిరోజుల ముందు వల్లభుడనే కవి, రాజును ప్రశంసిస్తూ ఇరవై నాలుగు గంటల పాటు పద్యాలు చదివి వినిపించాడు. అంతకు ముందుగా, శిల్పి చిత్రసేనుడు పాలరాతితో రాజు విగ్రహాన్ని అతి సుంద రంగా మలిచి సమర్పించాడు. రాజు ఎక్క డకి వెళ్లినా ప్రజలు పెద్ద ఎత్తున అతడిని సందర్శించి గౌరవించేవారు.

అజయసింహుడు ఎంతో భాగ్యశాలి. తన తండ్రి విజయ సింహుడు అష్టకష్టాల కోర్చి సామ్రాజ్యాన్ని విస్తరించాడు. ఇంత సువిశాల భూభాగాన్ని పాలించడానికి అతడు పటిష్టమైన పాలనా యంత్రాంగాన్ని ఏర్పర్చాడు. పన్నుల వసూలు, న్యాయ నిర్ణయం, సమస్యల పరిష్కారం క్రమం తప్పకుండా అమలయ్యేవి. సామంత రాజులు పెద్ద మొత్తాల్లో కప్పం చెల్లించే వారు. దీంతో అజయసింహుడికి చేయదగిన మహత్కార్యాలు ఏవీ లేకుండా పోయాయి. తన తండ్రి రాజ్యపాలనలో ప్రవేశపెట్టిన పద్ధతులను మార్చకుండా కొనసాగించడం తప్పిస్తే అతడు రాజ్యానికి పెద్దగా చేసిం దేమీ లేదు. అయితే తన చుట్టూ ఉన్నవారు తనను ఆరాధించే తీరు చూసి అతడు తన్ను తాను దేవుడి ప్రతిరూపంగా భావించుకో సాగాడు. ఈ ఆరాధనలు బాగా తలకెక్క డంతో ప్రజల బాగోగుల గురించి పట్టిం చుకోవడం, వారితో సంబంధాలలో ఉండటం వంటి విషయాల్లో ఆతడు విఫలమవుతూ వచ్చాడు. తన ప్రజలు నిజంగా సంతో షంగా ఉంటున్నారా అనే విషయం కూడా అతడి దృష్టికి రాకుండాపోయింది.

రాజ్‌పూర్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత, సమీపంలోని సుందరవనం అటవీప్రాం తంలో వేటకు వెళ్లాలని అజయసింహుడు ప్రయత్నాలు సాగించాడు. వేటకు సన్నా హాలు పూర్తి చేసుకుని బయలుదేరుతున్న

నీలమ్ చంద్ర

సమయంలో, వల్లభుడు రాజు వద్దకు పరుగెత్తి వచ్చాడు. వల్లభుడు రాజుతో, ''మహారాజా, మిమ్మల్ని ప్రశంసిస్తూ నేను పద్యకావ్యం రాశాను, దాన్ని మీకు విని పించ గోరుతున్నాను. ఈ పద్యకావ్యం ముప్పయ్యారు గంటలు కొనసాగుతుంది. మీమీద ఇంత దీర్ఘ కావ్యం పఠించడం చరిత్రకెక్కుతుంది.'' అన్నాడు ఆయాసంగా ఒగురుస్తూ.

అజయుడు తాను వేటకు వెళుతున్న విషయం చెప్పాడు. వల్లభుడు అందుకుని, ''మహారాజా, ప్రయాణంలో ఉండగానే మీకు పద్యం వినిపిస్తాను. మీతో పాటు ఏనుగుమీద కూర్చుంటాను అనుమతిం చండి'' అని అభ్యర్థించాడు.

అజయుడికి కూడా ఇంత దీర్ఘపద్యా లను వినాలని మనసులో ఉంది కాబట్టి అంగీకరించాడు. ఏనుగుపై కుదురుగా కూర్చున్న తర్వాత వల్లభుడు పద్యపఠనం ప్రారంభించాడు. తనను ప్రశంసిస్తూ వల్ల భుడు మధురమైన పదాలతో కూర్చి, తీర్చిన పద్య కావ్యాన్ని అజయుడు బాగానే ఆస్వా దించాడు.

అయితే కవిత్వ రంధిలో తాము ఇతరు లకంటే బాగా ముందుకెళ్ళిన విషయం వారు గుర్తించలేదు. వారి వెన్నంటి వచ్చిన బలగంలో ఒక్కరు కూడా వారికి కనబడ లేదు. ఇతరులకోసం వెతికే ప్రయత్నం చేశారు కాని ఫలించలేదు. ఈలోగా చీకటి అలుముకుంది. తమ వద్ద తినడానికి, తాగ డానికి ఏమీ లేవు. కాస్సేపు చీకటిలోనే అటూ ఇటూ తిరిగారు. తర్వాత ఒక సమతల ప్రాంతం చూసుకుని అక్కడే ఆ రాత్రి గడ



పాలని నిశ్చయించుకున్నారు.

ఉన్నట్లుండి, సమీపంలో ఒక దీపం మినుక్కుమనడం వారికి కనిపించింది. కాస్త ఆశలు చిగురించగా వారు వడివడిగా అక్కడికి వెళ్ళి, ఒక చిన్న కుటీరం చూశారు. కుటీరంలో నివసిస్తూ ఉన్న వ్యక్తికి అసౌకర్యం కల్పించకూడదని రాజు తన కిరీటాన్ని, ధరించిన ఆభరణాలను తీసివేశాడు.

కుటీరంలో ఓ పేదరాశి పెద్దమ్మ ఉంది. తాము బాటసారులమని, దారి తప్పి ఇటుగా వచ్చామని వారు ఆమెతో చెప్పారు. ఆమె వారికి స్వాగతం పలుకుతూ ''అతిథులు దేవుడితో సమానం. మీరు కోరుకునే ఆహారం పెట్టాలని ఉంది కాని, నావద్ద ఇప్పుడు మూడు రొట్టెలు మాత్రమే ఉన్నాయి. వాటిని తిందాం రండి.'' అని చెప్పింది.

ముగ్గురూ తలొక రొట్టె పంచుకున్నారు. కూర లేకపోవడంతో మిరపకాయ, కాసింత ఉప్పుతో నంజుకుని తిన్నారు. కాని, ఆక లితో నకనకలాడుతున్న రాజుకు ఆ రాత్రి




పూట తను తింటున్న రొట్టె అమృతం కంటే మధురంగా అనిపించింది. భోజనం ముగించిన తర్వాత రాజు, ''అమ్మా అడవి మధ్యలో నీవు ఒంటరిగా ఎందుకు ఉంటున్నావు, నిన్ను చూసుకోవడానికి ఎవరూ లేరా?'' అని అడిగాడు.

ఆమె ముఖం ఒక్కసారిగా ముడుచుకుపోయింది. ''నాకు ముగ్గురు కొడుకులు. కాని అంతా రాజు సైన్యంలో చేరిపోయారు. నా భర్త కూడా పరాక్రమవంతుడే. తను రాజ్య రక్షణ కోసం పోరాడుతూ చనిపోయాడు. స్వర్గస్తుడైన రాజు విజయసింహుడు నా ఇంటికి వచ్చి నా భర్తవల్లే తాను యుద్ధంలో విజయం సాధించగలిగానని, నా బిడ్డలను తిరిగి పంపుతానని వాగ్దానం చేశాడు. వారు కూడా సామ్రాజ్య పరిరక్షణ పట్ల చాలా మక్కువ చూపారు. కాని, దురదృష్టవశాత్తూ రాజు విజయసింహుడి మరణానంతరం సైనికుల జీతాలు తగ్గించివేశారు. నా పిల్లలు తమ సంపాదనలో చిన్న మొత్తం మాత్రమే పంపించగలగుతున్నారు.'' అని చెప్పింది.

అజయుడు ఆశ్చర్యపోయాడు. తనకు తెలిసి తాను జీతాలలో కోత విధించలేదు. సైనికులకు అందుతున్న జీతాల్లో ఎందుకు కోత పెట్టారు? మంత్రులేమయినా తప్పు చేశారా? ఆలోచనలో పడిన రాజు ''కాని, నీవెందుకు అడవిలో ఉంటున్నావు? హాయిగా ఊరిలో లేదా నగరిలో ఉండ వచ్చు గదా.'' అని అడిగాడు.

ఆమె సమాధానమిస్తూ, ''మీకు తెలీదా నాయనా? పన్నులు రెట్టింపయ్యాయి. అన్ని వస్తువుల ధరలూ పెరిగిపోయాయి. అడవిలో అయితే వంటచెరకును ఉచితంగా తెచ్చుకుంటున్నాను. అదే ఊళ్లో గాని, నగరంలో గాని ఉండేటట్లయితే, వంటకట్టెలకు ఎక్కువ ధర చెల్లించవలసి రావడమే కాదు, స్థానిక ప్రభువులకు కూడా పన్నులు చెల్లించాలి.'' అన్నది.

అజయుడు దిగ్భ్రాంతి చెందాడు. తాను పన్నులు పెంచలేదు. తనకు తెలియకుండా మంత్రులు ఇలాంటి చర్యలకు పాల్పడుతున్నారు. వృద్ధురాలితో రాజు మాట్లాడుతూ, ''అయితే ఈ సమస్యలన్నిటినీ రాజుతో చెప్పలేకపోయావా?'' అని అడిగాడు. ఆమె విషాదంగా నవ్వి ''రాజుకు చెప్పుకోవడమా, అతడు తనపై ప్రశంసా గీతాలు వినడంలోనే పొద్దు గడుపుతున్నాడు. తనపై గీసిన చిత్రాలను, శిల్పాలను చూస్తూ ఎవరినీ కలవడం లేదు. రాజు మీకు తెలిసి ఉంటే వెళ్లి సామాన్యులు పడుతున్న బాధల గురించి చెప్పండి. సైన్యంలో పని చేస్తున్న ముగ్గురు కొడుకుల తల్లి పరిస్థితే ఇలా ఉంటే ఇత

రుల బతుకు ఎలా ఉంటుందో ఆలోచించండి మరి?'' అని చెప్పింది.

అజయుడు కదిలిపోయాడు. ముసలామె చెప్పింది నిజంగా వాస్తవం.

ఆ రాత్రి రాజుకు నిద్రపట్టలేదు. తన రాజ్యంలోని ప్రజల పరిస్థితులను మెరుగు పర్చడానికి తగిన చర్యలు చేపట్టాలని అతడు నిశ్చయించాడు. ఇదంతా గమనిస్తున్న వల్లభుడు రాజును స్వాంతన పరుస్తూ ''ముసలామె పరిస్థితి ప్రత్యేకమైనది'' అంటూ సమర్థించాడు. అయితే రాజు అతడిని వారించాడు.

ఆ మరుసటి రోజు ఉదయం రాజు ముసలామె పాదాలకు మొక్కి, ''అమ్మా, రాత్రి నువ్వు చెప్పిన ఆ వ్యర్థ రాజును నేనే. కాని నీ మాటలు నన్ను ఆలోచింపజేశాయి. నేను తప్పు చేశానని నాకు తెలుసు. నాకు సరైన దారి చూపినందుకు కృతజ్ఞతలు,'' అని చెప్పాడు. ముసలామె సమాధానంగా నవ్వింది.

రాజు, వల్లభుడు అక్కడినుంచి కాస్తంత దూరం ప్రయాణించగా, తమ బలగాలు కూడా అక్కడే మజిలీ చేసి ఉండటం కనిపించింది. వారు రాజుకోసం వెదుకుతున్నారు. తనకు వేటకు వెళ్లాలని లేదని రాజు వారికి చెప్పాడు. వేటకు బదులు మార్గమధ్యంలో ఒకటి, రెండు ఊళ్ళను సందర్శించిన రాజు, ముసలామె తనకు చెప్పిన ప్రతి విషయం సరైనదేనని కనుగొన్నాడు.

తప్పుపనులకు పాల్పడిన వారిని, దళారులను దండించడం ద్వారా తగిన చర్యలు చేపట్టాలని రాజు ఆ క్షణమే నిర్ణయించుకున్నాడు. అప్పటినుంచే పాలనపట్ల శ్రద్ధ చూపటం ప్రారంభించాడు. అయితే కవులు, శిల్పులు, చిత్రకారులకు మునుపటిలా అతడు స్వాగత సత్కారాలు చేస్తూనే ఉన్నాడు. అతడు తన కోట ద్వారం వద్ద పెద్ద గంట వేలాడదీశాడు. రాజ్యంలో ఎవరికయినా సమస్యలు ఉంటే అలాంటి వారు ఏ సమయంలో అయినా సరే వచ్చి గంట మోగిస్తే చాలు తాను స్వయంగా వచ్చి సమస్యలు పరిష్కరిస్తానని రాజు ప్రకటించాడు.

రాజు తీసుకున్న చర్యలు త్వరలోనే ఫలించాయి. మారువేషంలో అతడు అప్పుడప్పుడు ఊర్లు, పట్టణాలను సందర్శిస్తూ వచ్చాడు. తన రాజ్యంలోని ప్రజలు మళ్లీ సుఖ సంతోషాలతో గడపడం అతడికి స్వయంగా అనుభవంలోకి వచ్చింది.





# ప్రత్యక్షపాఠం



రామయ్య చిన్న వ్యాపారి. తన గ్రామానికి నాలుగుకోసుల దూరంలో ఉన్న ఒక పట్నంలో వారానికి ఒకసారి జరిగే సంతలో సరుకు కొనుక్కుని వచ్చి, తన గ్రామంలో అమ్ముతుంటాడు. క్రమం తప్పకుండా ప్రతివారం సంతకు వెళ్ళి అంగడిలో సరుకులు నింపుతూ రావడంతో రామయ్య వ్యాపారం సజావుగా సాగిపోయేది.

ఒక సంత రోజున అతడు డబ్బు తీసుకుని పట్నం బయలు దేరాడు. ఐతే అతను కొంత ఆలస్యంగా బయల్దేరడంతో, పట్నం వెళ్ళే కిరాయిబళ్ళన్నీ వెళ్ళిపోయాయి. ఇక, తను నడిచి వెళ్ళాలి; లేదా ఆ వారానికి సంతకు వెళ్ళడం మానేయాలి.

రామయ్య ఆలోచించి చూశాడు. తను సంతకు వెళ్ళడం మానుకుంటే వారం రోజుల పాటు తన దుకాణంలో సరుకు అమ్మకం ఉండదు. తనకు రాబడి తగ్గుతుంది. అందుచేత, నడిచి వెళ్ళడానికే నిశ్చయించుకుని డబ్బు సంచి నడుం కట్టులో బిగించి బయల్దేరాడు.

కొంత దూరం నడిచాక, రామయ్యకు కాళ్ళు లాగసాగాయి. ఒక నడవటం సాధ్యం కాక ఇస్సుమంటూ ఒక చెట్టు కింద చతికిలపడ్డాడు.

కొన్ని నిమిషాల పాటు గడిచాక, రామయ్య ఏనాడూ చూడని కొత్తవాడొకడు అటుగా వచ్చి, అతణ్ణి ఎక్కడికి వెళుతున్నావని అడిగాడు.

తను పట్నం సంతలో సరుకు కొనడానికి వెళుతున్నట్లూ, మార్గాయాసం కొద్దీ చెట్టు నీడలో కూర్చున్నట్లూ రామయ్య చెప్పాడు.

ఆ కొత్తవాడు, నెత్తిపై ఉన్న పెద్ద మూట నొకదాన్ని దించి, రామయ్య పక్కగా వచ్చి కూర్చుని, అతణ్ణి ఆపాద

ఆర్. రేవతి



మస్తకం ఒకసారి పరీక్షగా చూసి, ''నా పేరు గురవయ్య, మనిద్దరం వర్తకులమే. అయితే నేను సంతలో సరుకు అమ్మ డానికి పోతున్నాను; మీరు సరుకు కొన డానికి పోతున్నారు, అంతే తేడా!'' అంటూ నవ్వాడు.

ఆ మాటకు రామయ్య కూడా నవ్వి, ''తేడా మాటకొస్తే మరొక తేడా కూడా ఉన్నది. నేను వయసు పైబడినవాణ్ణి; నువ్వు ఇంకా యువకుడివి. అందుకనే నెత్తిన అంత బరువు పెట్టుకుని మోస్తూ కూడా సునాయాసంగా పోతున్నావు.'' అన్నాడు.

గురవయ్య ఒక్క క్షణం ఆగి, ''ఆ మాట నిజమే! ఈ వయసులో మీరింత శ్రమ పడకండా, సంతలో కొనుగోలుకు, మీ గుమాస్తాను పంపవచ్చు కదా,'' అన్నాడు.

''ఈ పిదప కాలంలో గుమాస్తాలను నమ్మడమా? కట్టుకున్నదాన్ని, కన్నబిడ్డ లను కూడా ఈ రోజుల్లో నమ్మేందుకు లేదు,'' అన్నాడు రామయ్య.

''అయితే జీవితంలో మీరెవర్నీ నమ్మ రన్న మాట?'' అంటూ తెగ ఆశ్చర్యపో యాడు గురవయ్య.

''అంతే, నేనెవర్నీ నమ్మను. నమ్మక చెడినవాడూ, నమ్మి బాగుపడిన వాడూ లోకంలో ఉండడు!'' అని రామయ్య తన ఛలోక్తికి తానే విరగబడి నవ్వసాగాడు.

''మహ బాగా చెప్పారు! మీ వయ సుకు ఇంత దూరం నడిస్తే, కాళ్లనొప్పులు రాక ఏమవుతుంది. పెద్దవారు, కాస్త మీ కాళ్లు పట్టనీయండి,'' అంటూ గుర వయ్య చేతులు చాచాడు.

రామయ్య చప్పున కాళ్లను వెనక్కు లాక్కుంటూ, ''అయ్యయ్యో! ఏమీ అవసరం లేదు. కాస్సేపు కూర్చుంటే కాళ్ల నొప్పులు వాటంతటవే తగ్గుతాయి,'' అన్నాడు.

''అలా అనకండి, మీరు నాకేం డబ్బు లివ్వక్కర్లేదు. సాటి వర్తకుణ్ణి, అలసట చెందిన పెద్దలకు సేవ చెయ్యడం నాకు ఆనందం, తృప్తి,'' అంటూ రామయ్య వద్దంటున్నా వినిపించుకోకుండా కాళ్లు ఒత్తసాగాడు గురవయ్య.

రామయ్యకు తాను సేద తీరుతున్న ట్టనిపించి, మెదలకుండా ఊరుకున్నాడు. గురవయ్య ఆ మాటా, ఈ మాటా చెబుతూ కాళ్ల తర్వాత, భుజాలూ తలా పడుతూ, తల, మెడనరాలు సుతారంగా

నొక్కి రామయ్యకు స్పృహ లేకుండా చేశాడు.

తర్వాత అతడి నడుం కట్టులో ఉన్న సంచి తీసుకుని వెళ్లిపోయాడు. కొంత సేపటికి రామయ్యకు స్పృహవచ్చింది. లేచి కూర్చున్న వెంటనే నడుం తడుము కుని చూసుకున్నాడు. డబ్బు సంచీ లేదు!

మతి పోయినవాడల్లే అటూ, ఇటూ పరిగెత్తబోయి, దూరంగా ఒక చెట్టుకింద కూర్చుని ఉన్న గురవయ్యను చూసి ఒక్క దూకున పోయి, ''దుర్మార్గుడా! ఇంత మోసం చేస్తావా! నా డబ్బు సంచీ ఎక్కడ?'' అంటూ అతడి మెడ పట్టుకున్నాడు.

''ఆగండి! తొందరపడకండి, ఇదుగో మీ డబ్బుసంచి,'' అంటూ గురవయ్య రామయ్యకు డబ్బు సంచి ఇచ్చేశాడు.

రామయ్య సంచీలోని డబ్బు లెక్క పెట్టి చూసుకున్నాడు. ఉండవలసిం దంతా ఉన్నది. గురవయ్య తనకు తెలీ కుండా డబ్బు సంచీ ఎందుకు తీసుకు న్నాడో, మళ్ళీ తనే ఎందుకు ఇస్తున్నాడో రామయ్యకు అర్థం కాలేదు. అతడు ఎక్కడ లేని ఆశ్చర్యంతో ''ఏమిటిదంతా?'' అని ప్రశ్నించాడు గురవయ్యను.

''మరేం లేదు. మీకొక ప్రత్యక్ష పాఠం చెప్పదలిచాను. ఇందాకా మీరు మాట్లా డుతూ లోకంలో ఎవరినీ నమ్మనన్నారు. కాని కాస్సేపటిలోనే దాన్ని మర్చిపోయి ముక్కూ మొహం ఎరుగని నన్ను నమ్మే శారు. అవునా?'' అన్నాడు గురవయ్య.

రామయ్య అవునంటూ తల ఊపాడు. అప్పుడు గురవయ్య తన మూటను నెత్తి కెత్తుకుని, ''ఇక పోదాం పదండి! బుద్ధి మంతుడైన మనిషి లోకంలో అందర్నీ, దొంగలు గానో మోసగాళ్లుగానో అనుమా నించకూడదు. గుమాస్తాలనూ, ఆత్మబం ధువులను కూడా నమ్మనన్న మీరు, ముక్కూ మొహం ఎరగని నన్ను నమ్మి దాదాపు వెంట తెచ్చుకున్న డబ్బంతా పోగొట్టుకున్నంతపని చేశారు,'' అన్నాడు.

రామయ్య అవునన్నట్టు తల ఊపి, గురవయ్య వెంట పట్నం కేసి నడవసా గాడు.







# అదాన్ - ఇద్దరు రాజులు

సముద్రాలపై పయనించాలని, సుదూర ప్రాంతాలను సందర్శించి రావాలని అదాన్ కలలు కంటూండేవాడు. ఒకరోజు అతడి కోరిక నిజమైంది. డెన్మార్క్ వైపుగా వెళుతున్న ఒక వ్యాపారి తన ఊరికి వచ్చాడు. తనను కూడా ఓడలో ఎక్కించుకోవాలని వ్యాపారిని ప్రాధేయపడిన అదాన్ అందుకు ప్రతిఫలంగా రోజూ ఓడలో, పని చేస్తానని ఒప్పందం కుదుర్చుకున్నాడు. అదే సమయంలో మూడేళ్లలో తిరిగి ఇంటికి వస్తానని తల్లికి వాగ్దానం చేశాడు కూడా.

అనుకోకుండా దొరికిన అవకాశంతో, అదాన్ అనేక ప్రాంతాలు చూడగలిగాడు. ఒకసారి అతడు గ్రీన్‌ల్యాండ్‌లో అడుగు పెట్టాడు. అక్కడ అతడు ఒక అద్భుత ప్రాంతాన్ని చూశాడు. మంచులో వందలాది ధ్రువప్రాంత ఎలుగుబంట్లు ఒకదాన్ని మరొకటి తోసుకుంటూ సరదాగా ఆడుకోవడం చూశాడు. అదాన్ వాటిలో ఒక దాన్ని తన వెంట తీసుకెళ్లాలని అనుకున్నాడు. డెన్మార్క్ రాజు స్వెన్‌కి దాన్ని బహుకరించాలని నిర్ణయించుకున్నాడు. అయితే ఓడ నేరుగా డెన్మార్క్ వైపు వెళ్లడం లేదు. పదార్థాల కోసం ఆహార ఓడ నార్వే రేవులో ఆగింది. ధ్రువప్రాంత ఎలుగుబంటి విషయం తెలుసుకున్న ప్రజలు దాన్ని చూడటానికి వచ్చారు. ఈ వార్త శరవేగంగా వ్యాపించి నార్వే రాజుకు చేరింది. రాజు అతడిని కలవడానికి ఆసక్తి చూపాడు.

అదాన్, నార్వే రాజు హెరాల్డ్‌ని కలుసుకున్నాడు. రాజు అతడిని ఆహ్వానిస్తూ, ''నువ్వు నాకోసం బహుమతి తీసుకువచ్చావని తలుస్తున్నా,'' అన్నాడు. అదాన్ నసిగాడు.

''మంచిది, తెల్ల ఎలుగుబంటు రాజుకు సమర్పించడానికి తగిన బహుమతే కదూ?'' అంటూ రాజాస్థానంలోని మంత్రి అందుకున్నాడు. అదాన్ ముఖం ఎర్రబడింది. ''క్షమించండి మహారాజా. నేను దీన్ని డెన్మార్క్ రాజుకి ఇవ్వాలనుకున్నాను,'' అని గొణిగాడు.



రాజు వదనం కోపంతో ఎర్రబడింది. ఆస్థానంలోని వారు కోపంగా మాట్లాడసాగారు. ఇద్దరు సైనికులు తమ కత్తులు దూసి అదాన్ వైపు దూసు



కుని వచ్చారు. అదాన్ వణికిపోయాడు. కాని రాజు చేతులూపి వారిని అడ్డుకున్నాడు.

''కుర్రవాడా, నార్వే, డెన్మార్క్ యుద్ధంలో మునిగి ఉన్నాయని నీకు తెలుసు. అయినా నీవు నా ఆస్థానంలో నా ముందు నిలబడి డెన్మార్క్ రాజు స్వెన్‌కి ఎలుగుబంటిని ఇస్తానని చెబుతున్నావు. ఎంత ధైర్యం నీకు?'' అన్నాడు నార్వే రాజు.

''అవును మహారాజా, నా ఉద్దేశం అదే,'' అన్నాడు అదాన్ మెల్లగా.

ఆస్థానంలో చీమ చిటుక్కుమంటే వినబడేంత నిశ్శబ్దం. రాజు హెరాల్డ్ కాస్సేపు మౌనం వహించి చెప్పాడు, ''సరే, నేను నిన్ను అడ్డుకోను. అయితే ఒక షరతు. నీవు డెన్మార్క్ నుంచి తిరిగి వచ్చాక ఆ రాజు నీ నుంచి ఎలుగుబంటిని తీసుకుని నీకు ఏ బహుమతి ఇచ్చాడో నాకు నీవే వచ్చి చెప్పాలి. ఇప్పుడు నీవు వెళ్లవచ్చు.'' అదాన్ బతుకు జీవుడా అనుకుంటూ తల వంచి రాజుకు నమస్కరించి కాళ్ళు వణుకుతుండగా వెంటనే అక్కడినుంచి వెళ్లిపోయాడు.

తర్వాత డెన్మార్క్ చేరిన అదాన్, రాజు స్వెన్‌కి ఎలుగుబంటిని బహుమతిగా ఇచ్చాడు. ''చాలా సంతోషం, నీకేం బహుమతి కావాలో కోరుకో అదాన్,'' అని అడిగాడు రాజు స్వెన్.

''నేను తీసుకువచ్చిన ఈ బహుమతి మిమ్మల్ని సంతోషపెట్టింది, ఇది మీ జీవితంలోనే గొప్ప బహుమతి అనుకుంటాను కద ప్రభూ,'' అన్నాడు అదాన్.

''అవును, కావచ్చు,'' అంటూ నవ్వాడు రాజు.

రాజు స్వెన్ అతడిని ఒక చోటికి తీసుకుపోయి అక్కడ ఉన్న ఓడను చూపించాడు. అది సుందర మైన ఓడ. ''ఈ ఓడ గురించి నీవేమనుకుంటున్నావు?'' అని అడిగాడు రాజు.

''నా జీవితంలో ఇంత చక్కటి ఓడను నేనింతవరకు చూడలేదు,'' అంటూ ఆశ్చర్యం వ్యక్తంచేశాడు అదాన్.

''ఈ ఓడ నీదే, ఓడనిండా వస్తువులున్నాయి. అవి కూడా నీవే,'' అని చెప్పాడు రాజు.

అదాన్ నోట మాట లేదు. రాజుకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

''నేనిప్పటికీ భయపడుతున్నాను. ఇప్పుడు సముద్రం అల్లకల్లోలంగా ఉంది. పైగా రాతి దిబ్బలు ఓడను గుద్దుకునే ప్రమాదం కూడా ఉంది. ఓడ మునిగిపోతే నీ పరిస్థితి ఏమిటి? అందుకే వెండినాణాలు నింపిన ఈ సంచిని కూడా ఇస్తున్నాను తీసుకో,'' అంటూ రాజు పెద్ద సంచీని

అదాన్‌కి ఇచ్చాడు.

అదాన్ రాజుకు హృదయపూర్వక కృత జ్ఞతలు తెలిపాడు. రాజు మళ్లీ అందుకుని, 'నేనిప్పటికీ సంతోషంగా లేను. ఈ సంచీని కూడా నీవు పోగొట్టుకుంటే, దొంగలు దోచుకుంటే... అందుకే ఈ ఉంగరం కూడా తీసుకో...'' అంటూ రాజు తన రాజముద్ర కలిగిన బంగారు ఉంగరాన్ని తీసి అదాన్‌కి ఇచ్చాడు. ''ఈ ఉంగరం నీది. దీన్ని నీ దృష్టిలో ఎవరయినా మంచి వ్యక్తి ఉంటే వారికి నువ్వు ఇవ్వవచ్చు,'' అని చెప్పాడు డెన్మార్క్ రాజు.

''మీరు దయాళువు రాజా, మీకు చెప్ప డానికి తగినన్ని కృతజ్ఞతలు నా వద్ద లేవు,'' అన్నాడు అదాన్ వినయంగా.

తర్వాత అదాన్ మళ్లీ ఐస్‌ల్యాండ్ దారి పట్టాడు. అయితే దారి మధ్యలో నార్వేకి వెళ్లి హెరాల్డ్ రాజును కలిసే విషయం అతడు మర్చిపోలేదు. రాజు అతడిని ఆహ్వా నించాడు. ''రా అదాన్, నా శత్రువు నీకు ఇచ్చిన చక్కటి బహుమతులు ఏవో కాస్త చూపవా?'' అని అడిగాడు రాజు.

''ఆయన నాకు ఓడ, సరుకుల నౌకను బహుమతిగా ఇచ్చాడు రాజా.'' చెప్పాడు అదాన్.

''నేను కూడా వీటిని ఇచ్చేవాడిని కదా,'' అన్నాడు రాజు.

''ఓడ, సరుకుల నౌకను నేను కోల్పోయినట్లయితే ఉంచుకోవడా నికి గాను ఈ నాణేల సంచిని కూడా ఇచ్చారు,'' అన్నాడు అదాన్.

''చక్కటి యోచనాపరుడు, నన్న డిగితే ఓడ,సరకుల నౌక రెండేచాలు.'' అని అభిప్రాయం వెలిబుచ్చాడు రాజు.

''తన రాజముద్ర కలిగిన బంగారు ఉంగరాన్ని కూడా ప్రసాదించాడు ప్రభూ, దాన్ని నేనే ఉంచుకోవచ్చని లేదా నేను కలిసే గొప్ప వ్యక్తికి ఇవ్వవచ్చని కూడా చెప్పాడు మహారాజా, ఈ ఉంగరాన్ని మీకు ఇవ్వడా నికి నన్ను అనుమతించండి.'' అన్నాడు అదాన్.

హెరాల్డ్ రాజు చకితుడయ్యాడు. ''కాని, నేనీ బహుమతికి తగుదునని నీవెందుకు అనుకుంటున్నావు?'' అన్నాడు నార్వే రాజు.

''మీరు తలుచుకున్నట్లయితే నన్ను ఆరోజే బంధించి ఖైదులో పెట్టేవారు. కాని మీరు దయగలవారు ప్రభూ,'' చెప్పాడు అదాన్.

తర్వాత సుందర ఓడ, సరకుల నౌక, సంచీడు వెండినాణేలతో పాటు నార్వే రాజు ఇచ్చిన ఇతర బహుమానాలతో పాటుగా అదాన్ ఐస్‌ల్యాండ్‌కు బయలుదేరి వెళ్లాడు. ఈ మొత్తం కథను తల్లికి చెప్పడానికి అతడు అట్టే వేచి ఉండలేకపోయాడు.

పునఃకథనం : రమారమేష్



# కెరీర్ అంటే?



మిత్రులారా!

ఈరోజు నాకు మేఘాల్లో తేలిపోతున్నట్లు ఉంది. ఎందుకంటే నా కెరీర్‌ని నిర్ణయించగలిగిన విశిష్ట విభాగాలను నేను ఇవ్వాళ అన్వేషించగలిగాను మరి. పదవ తరగతి, ఇంటర్మీడియట్ తర్వాత నాకు గల అవకాశాలు ఏవి అని తరచి చూశాను. సైన్స్, ఆర్ట్స్ లేదా కామర్స్.. ఇవి పెద్ద అవకాశాలేమీ కాదు. అయితే ఈ ఎంపికలలో పలు కాంబినేషన్‌లతో కూడిన అవకాశాలున్నాయని మీకు తెలుసా? నా కెరీర్ సలహాదారును నేను కలుసుకున్నప్పుడు ఆమె వాటిని వివరించడమే కాకుండా, వీటిపై నిర్ణయించుకోవలసి వచ్చినప్పుడు అనుసరించవలసిన కొన్ని చిట్కాలు కూడా తెలిపింది. గత నెలలో మీరు విధించుకున్న చిరు లక్ష్యాలని మనసులో ఉంచుకోండి!

**10వ తరగతి పూర్తి చేశాక అందుబాటులో ఉండే అవకాశాలు**

సైన్స్–

పి.సి.ఎమ్.బి (భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, గణితం, బయాలజీ)

పి.సి.ఎమ్.సీలు (భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, గణితం, కంప్యూటర్ సైన్స్)

పి.సి.బి.హెచ్‌లు (భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, బయాలజీ, హోమ్ సైన్స్)

కామర్స్–

అకౌంట్స్, ఎకనమిక్స్, బిజినెస్ స్టడీస్, కంప్యూటర్ సైన్స్

అకౌంట్స్, ఎకనమిక్స్, బిజినెస్ స్టడీస్, హోటల్ మేనేజ్‌మెంట్

అకౌంట్స్, ఎకనమిక్స్, బిజినెస్ స్టడీస్, ట్రావెల్ – టూరిజం

హ్యుమానిటీస్–

చరిత్ర, అర్ధశాస్త్రం, సోషియాలజీ, రాజనీతి శాస్త్రం

చరిత్ర, అర్ధశాస్త్రం, సోషియాలజీ, జర్నలిజం

చరిత్ర, అర్ధశాస్త్రం, సోషియాలజీ, మనస్తత్వశాస్త్రం

**12వ తరగతి పూర్తి చేశాక అందుబాటులో ఉండే అవకాశాలు**

సైన్స్–

ఇంజనీరింగ్: ఇంజనీరింగ్ విభాగాలు ఐటీ, ప్రీమియర్ ఇంజనీరింగ్ కాలేజీలు, ఐఐటీ

అడ్మిషన్, ఏఐఈఈఈ బిట్‌శాట్
పారామెడికల్ కోర్సులు: నర్సింగ్, ఫార్మసీ, ఫిజియోథెరపి, ఆక్యుపేషనల్ థెరపీ.
మ్యాథ్స్ మరియు ఫిజిక్స్: గణిత శాస్తం, కంప్యూటర్ సైన్స్, స్టాటిస్టిక్స్, భూగర్భశాస్త్రం
పర్యావరణం మరియు సోషల్ సైన్స్: విపత్తు నిర్వహణ, విద్యా నిర్వహణ, పర్యావరణ నిర్వహణ.
వైద్యం: ఎంబీబీఎస్, బీడీఎస్, బీఏఎమ్ఎస్, బీహెచ్ఎమ్ఎస్.
కెమిస్ట్రీ మరియు బయాలజీ: జీవశాస్త్రం, పర్యావరణ శాస్త్రం, జన్యుశాస్త్రం, ఫోరెన్సిక్స్, వన్యప్రాణుల అధ్యయన శాస్త్రం.
అనుబంధిత శాస్త్రం: ఫారెస్ట్రీ, వెటర్నరీ సైన్స్, హార్టికల్చరల్/ఫ్లోరీకల్చర్/అగ్రికల్చరల్/ఫిషరీస్.
కామర్స్–
బ్యాంకింగ్
హోటల్ మేనేజ్‌మెంట్
ట్రావెల్ మరియు టూరిజం
ఫైనాన్స్ మరియు మేనేజ్‌మెంట్: మదుపులు, ఎకౌంటింగ్, హెచ్ఆర్‌డీ, మార్కెట్ రీసెర్చ్.
హ్యూమానిటీస్–
చరిత్ర, అర్థశాస్త్రం, రాజనీతి శాస్త్రం, సైకాలజీ
ఆర్ట్: యానిమేషన్, ఆర్కిటెక్చర్, కార్టూనింగ్, ఇలస్ట్రేషన్
మీడియా మరియు కమ్యూనికేషన్: అడ్వర్టయిజింగ్, ఫిల్మ్, జర్నలిజం, ఫోటోగ్రఫీ.
ఎగుమతి నిర్వహణ: ఎగుమతి నిర్వహణ, వస్తు నిర్వహణ.

ఫ్యాషన్ డిజైన్, ఇంటీరియర్ డెకరేషన్ వంటి కోర్సులలో అందరూ చేరవచ్చు. ఇవి పది, ఇంటర్మీడియట్ పూర్తి చేసిన తర్వాత మనకు అందుబాటులో ఉంటున్న కోర్సులలో కొన్ని మాత్రమే.

– సాయి



# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 21

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 21 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. అక్టోబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. డిసెంబర్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారతీయ వన్యప్రాణులు!



1. మధ్యప్రదేశ్‌లోని జాతీయ పార్కు పేరేమిటి?
2. అస్సాంలోని కజిరంగ జాతీయ పార్కులో కనిపించే విశిష్ట జంతువు ఏది?
3. బెంగాల్ పులులను సంరక్షించడానికి 1972లో భారత్‌లో ప్రారంభించిన వన్య ప్రాణి సంరక్షణ ఉద్యమం ఏది?
4. భారతదేశంలో ఎన్ని జాతీయ పార్కులు మరియు వన్యప్రాణి సంరక్షణ కేంద్రాలు ఉన్నాయి?
5. భారత్‌లో, మహానగరంలో నెలకొన్న అతి చిన్న జాతీయ పార్కు ఏది?
6. మన జాతీయ జలచర జంతువు ఏది?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-19 ఆగస్ట్ 2010 సమాధానాలు

1. రవీంద్రనాథ్ టాగూర్, 2. జి. శంకర్ కురుప్, 3. మాల్గుడి, 4. జిమ్ కార్బెట్, 5. కాళిదాసు, 6. విష్ణుశర్మ, 7. సరోజిని నాయుడు

ఆగస్ట్ నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు డిసెంబర్ 2010 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కరికి రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 7 | | | 2 | | 6 | 8 | |
| 4 | | | | | 3 | | | |
| | | | | | | | 9 | |
| | 5 | 7 | | | | | | |
| | | | 7 | | | | | 1 |
| | 6 | 9 | | 8 | | | | |
| | | | | | 1 | | | 5 |
| | 8 | | | 9 | | | 2 | |
| 7 | | | 4 | | | | | |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 5 | | | 3 | |
| | | | | | 7 | | | 6 |
| | 6 | 8 | | | 1 | | 5 | |
| | | 6 | | | | | | 7 |
| 7 | | | 8 | | 4 | | | 3 |
| 4 | | | | | | 5 | | |
| | 5 | | 9 | | | 1 | 2 | |
| 8 | | | 7 | | | | | |
| | 9 | | | 2 | | | | |

మీ ఎంట్రీలను 2010 అక్టోబర్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

e-mail your entries to:contests@chandamama.com

---

ఆగస్ట్' 10 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 2 | 7 | 3 | 9 | 4 | 5 | 1 | 6 |
| 4 | 5 | 1 | 7 | 8 | 6 | 9 | 3 | 2 |
| 3 | 6 | 9 | 2 | 1 | 5 | 4 | 8 | 7 |
| 9 | 7 | 3 | 8 | 6 | 2 | 1 | 4 | 5 |
| 2 | 1 | 8 | 5 | 4 | 7 | 3 | 6 | 9 |
| 5 | 4 | 6 | 1 | 3 | 9 | 7 | 2 | 8 |
| 7 | 3 | 5 | 6 | 2 | 1 | 8 | 9 | 4 |
| 1 | 9 | 2 | 4 | 7 | 8 | 6 | 5 | 3 |
| 6 | 8 | 4 | 9 | 5 | 3 | 2 | 7 | 1 |

ఆగస్ట్' 10 సుడోకు పజిల్స్‌కు విజేతలు లేనందు వల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 6 | 1 | 7 | 4 | 3 | 9 | 5 | 8 |
| 8 | 4 | 5 | 6 | 1 | 9 | 7 | 2 | 3 |
| 7 | 9 | 3 | 5 | 2 | 8 | 4 | 6 | 1 |
| 4 | 7 | 9 | 3 | 6 | 5 | 1 | 8 | 2 |
| 3 | 2 | 6 | 4 | 8 | 1 | 5 | 9 | 7 |
| 5 | 1 | 8 | 2 | 9 | 7 | 6 | 3 | 4 |
| 9 | 3 | 4 | 8 | 7 | 6 | 2 | 1 | 5 |
| 1 | 8 | 2 | 9 | 5 | 4 | 3 | 7 | 6 |
| 6 | 5 | 7 | 1 | 3 | 2 | 8 | 4 | 9 |



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.






| English | My school is near my house. | I know to swim. |
|---|---|---|
| Telugu | మా పాఠశాల మా ఇంటికి దగ్గరగా ఉంది. | ఈత కొట్టడం నాకు తెలుసు. |
| Hindi | मेरा स्कूल घर के पास है।<br>మేరా స్కూల్ ఘర్ కె పాస్ హై. | मझे तैरना आता है।<br>ముజె తైర్నా అతా హై. |
| Tamil | என் பள்ளி என் வீட்டருகே இருக்கிறது<br>ఎన్ పల్లి ఎన్ వీటురుగె ఇరుక్కిరథు | எனக்கு நீந்தத் தெரியும்<br>ఎనక్కు నీంద తెరియుమ్ |
| Bengali | আমার বিদ্যালয় আমার বাড়ীর কাছে।<br>ఆమార్ బిద్యాలయ్ ఆమార్ బాదిర్ కాచ్చే | আমি সাঁতার কাটতে জানি<br>ఆమి శాంథార్ కాట్టే జాని |
| Marathi | माझी शाळा माझ्या घराजवळ आहे.<br>మాఝి శాళా మాఝుయా ఘరాజవళ్ ఆహె. | मला पोहोता येते.<br>మాలా పోహోతా యెతె. |
| Kannada | ನನ್ನ ಶಾಲೆಯು ನನ್ನ ಮನೆಯ ಸಮೀಪ ಇದೆ<br>నన్న శాలెయు నన్న మనెయ సమీప ఇదె. | ನನಗೆ ಈಜಲು ಗೊತ್ತಿದೆ<br>ననగె ఈజలు గొత్తిదె. |
| Oriya | ମୋ ସ୍କୁଲ ଆମ ଘର ପାଖରେ ଅବସ୍ଥିତ।<br>మో స్కూల్ అమా ఘరా పఖారె అబాస్థిటా. | ମୁଁ ପହଁରା ଜାଣେ।<br>మున్ పహన్‌రా జానె. |
| Gujarati | મારી નિશાળ મારા ઘરની નજીક છે.<br>మారీ నిశాల మారా ఘర్‌నీ నజీక్ చె. | મને તરતા આવડે છે.<br>మనె తరతా ఆవడె చె. |
| Assamese | মোৰ স্কুলখন মোৰ ঘৰৰ ওচৰতে।<br>మొర్ స్కూల్‌ఖన్ మొర్ ఘరర్ ఒసరతె. | মই সাতুৰিব জানো।<br>మయి గ్జాతురిబ జానొ. |
| Malayalam | വീടിന് അടുത്താണ് എന്റെ സ്കൂൾ<br>వేదిను అడుతను ఎంటే స్కూల్. | എനിക്ക് നീന്താൻ അറിയാം<br>ఎనిక్కు నీంథన్ అయిరమ్. |
| Santali | ᱚᱲᱟᱜ ᱥᱩᱨ ᱨᱮᱜᱮ ᱟᱥᱞᱟ ᱴᱤᱝ ᱫᱚ<br>ఒడాగ్ సుర్ రెగె అశ్లా టింగ్ డో. | ᱤᱧ ᱯᱚᱭᱨᱟᱜ ᱤᱧ ᱵᱟᱲᱟᱭᱟᱜ<br>ఇన్జి పయరాగ్ ఇన్జి బడాయాట |
| Sanskrit | मम पाठशाला गृहं निकषा अस्ति ।<br>మమ పాఠశాల గృహమ్ నికష అస్థి. | अहं तरितुं जानामि ।<br>అహమ్ తరితుమ్ జానామి |





| English | My dog is brown in colour. | The weather is hot. |
|---|---|---|
| Telugu | నా కుక్క గోధుమ రంగులో ఉంది. | వాతావరణం వేడిగా ఉంది. |
| Hindi | मेरे कुत्ते का रंग भूरा है।<br>మెరె కుత్తే కా రంగ్ బూరా హై. | मौसम गर्म है।<br>మౌసమ్ గర్మ్ హై. |
| Tamil | என்னுடைய நாயின் நிறம் பழுப்பு<br>ఎన్నుడయ నాయిన్ని నిరమ్ పళుప్పు | இன்று வெப்பமாக உள்ளது<br>ఇన్‌దు వెప్పమ్మాగ ఉల్లదు. |
| Bengali | আমার কুকুরের রক্ত খয়েরী<br>ఆమాక్ కుకురెర్ రంగ్ ఖయెరీ | আবহাওয়া গরম<br>అబహాఓవా గరమ్ |
| Marathi | माझा कुत्रा भुरकट रंगाचा आहे.<br>మార్ఝా కుత్రా భురకట్ రంగాచా ఆహె. | हवामान गरम आहे.<br>హవామాన్ గరమ్ ఆహె. |
| Kannada | ನನ್ನ ನಾಯಿಯ ಬಣ್ಣ ಕಂದು<br>నన్న నాయియ బణ్ణ కందు | ವಾತಾವರಣ ತುಂಬಾ ಬಿಸಿಯಾಗಿದೆ<br>వాతావరణ తుంబా బిసియాగిదె. |
| Oriya | ମୋ କୁକୁରର ରଙ୍ଗ କସରା।<br>మో కుకురారా రంగా కసరా. | ପାଗ ଗରମ ରହିଛି।<br>పగ గరమ్ రహచ్ఛి. |
| Gujarati | મારા કૂતરાનો રંગ ભૂરો છે.<br>మారా కూతరానో రంగ్ భూరొ చె. | હવામાન ગરમ છે.<br>హవామాన్ గరమ్ చె. |
| Assamese | মোৰ কুকুৰটো মুগা বৰণীয়া।<br>మొర్ కుకురటో ముగా బరనీయ. | বতৰটো গৰম।<br>బతరటో గరమ్. |
| Malayalam | എന്റെ നായയ്ക്ക് തവിട്ടുനിറം ആണ്<br>ఎంటె నాయయక్కు థవిట్టు నిరమ్ ఆను. | ചൂടുള്ള കാലാവസ്ഥ ആണ്<br>ఛోడుల్ల కాలావస్థ ఆను. |
| Santali | ᱤᱧᱟᱜ ᱥᱮᱛᱟ ᱫᱚ ᱦᱟᱥᱟ ᱨᱚᱝ ᱥᱮ<br>ఇన్జి సెటా డు హస రంగ్ సే. | ᱦᱚᱭ ᱦᱤᱥᱤᱫ ᱫᱚ ᱞᱚ-ᱞᱚ ᱜᱮᱭᱟ<br>హోయ్ హిసిద్ డో-లో-లా గెయ్యా. |
| Sanskrit | मम कुक्कुर: धूसरवर्ण: अस्ति ।<br>మమ కుక్కురః దూసరవర్ణః అస్థి. | वातावरणम् उष्णम् अस्ति ।<br>వాతావరణమ్ ఉష్ణమ్ అస్థి. |



# నవ్వుల పువ్వులు



బస్ కండక్టర్: నీవు కాసేపటి క్రితం ఇచ్చిన నాణేనికి రంధ్రం ఉంది.
యువ ప్రయాణీకుడు: మరి మీరు నాకు ఇచ్చిన ఈ టికెట్‌లో కూడా రంధ్రం ఉంది కదా!



టీచర్: పిల్లలూ, నిన్న మీకు భూత కాలం గురించి చెప్పాను కదూ? బీనా, ఇక్కడికి వచ్చి ఒక ఉదాహరణ ఇవ్వు.
బీనా: టీచర్, నేను నిన్న బడికి రాలేదు.
టీచర్: వెరీ గుడ్ బీనా, నీవు కూర్చోవచ్చు. నీకు పాఠం బాగా బోధపడిందనుకుంటున్నాను.



టైలర్: మీ సూట్ రెండు నెలల్లో సిద్ధమవుతుంది సర్.
కస్టమర్: రెండు నెలలా? ఇంత పెద్ద ప్రపంచాన్ని సృష్టించడానికి ఆ దేవుడికి ఆరు రోజులే పట్టింది కదా?
టైలర్: నిజమే సర్! కానీ ఈరోజు ప్రపంచం పరిస్థితి ఓసారి చూడండి మరి.



కొరియర్ బాయ్ ఇంటి ముందున్న గేటు వద్ద లాన్‌లో కుక్కను చూశాడు. కిటికీలోంచి ఓ మహిళ చూస్తూ ఉండటం గమనించి ఆమెను అడిగాడు. ''మీ కుక్క మంచిదేనా అమ్మా?''

''అవును,'' అని ఆమె చెప్పగానే ఇతడు గేటు తెరిచాడు. వెంటనే కుక్క అతడిని కరిచింది!

ఆతడామెకేసి కోపంగా చూశాడు. ''మీ కుక్క చాలా మంచిదని కితాబు ఇచ్చారే!''

''అవును. మంచిదే!'' అన్నదామె. ''కాని ఇది నా కుక్క కాదు మరి.''

## మూడువందల పాఠాంతరాలతో రామాయణం!




రామాయణ మహాభారతాలు మన ఇతిహాసాలు అన్న సంగతి మనకంద రికీ తెలుసు. వీటిలో ఆదికావ్యంగా పేరొందిన రామాయణానికి ఒక్క సంస్కృతంలోనే ఇరవై అయిదు పాఠాంతరాలు ఉన్నాయి. తుళు, గిరి జనభాషలైన భిలీ, సంతాలి భాషలతో కలుపుకుంటే మన భారతీయ భాష లలో అనేక పాఠాంతరాలు ఉన్నాయి. అన్నమీస్, బాలినీస్, కంబోడియన్, చీనా, జాపనీస్, లోటియన్, మలాయ్, థాయ్, టిబెటన్ భాషలలో సైతం రామాయణం ఉండడం దీని ప్రసిద్ధిని చాటుతున్నది. ఐరోపా భాషలలోనూ కొన్నిరకాల రామాయ ణాలు ఉన్నాయి. అంటే మొత్తం మీద దాదాపు 300 పాఠాంతరాలున్నాయి. వీటిని పరిశీలించిన ఒక సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుడు ఇలా అన్నాడు: ''రామాయణం ఒక నిర్దిష్ట కాలఘట్టానికి సంబంధించిన గ్రంథం కాదు. ఒక కథాంశం చుట్టూ విభిన్న భాషలలో వివిధ ప్రాంతాలలో రచింపబడిన పాఠాంతరాలలో దాని చరిత్ర నిక్షిప్తమై ఉన్నది.''

## పనియా తెగ

కేరళ రాష్ట్రంలో పనియా తెగ ప్రజలు అత్యధిక సంఖ్యలో ఉన్నారు. వయనాడ్ మరియు కన్నూర్, మాలాప్పురం ప్రాంతాలలో వీరు నివసిస్తున్నారు.

భూస్వాములు ఒకప్పుడు తమ తోట లతో పాటు పనియాలను వెట్టికార్మికుల కింద అమ్మేశారు. పనియాన్ అంటే మలయాళంలో కూలిపనివాడు అని అర్థం. కన్యాశుల్కం ఈ తెగలో నాటికీ అమలవుతోంది. విధవా వివాహాలు కూడా అనుమతిస్తున్నారు. వీరి ప్రధాన దేవత కాళి. మర్రిచెట్టును కూడా పూజిస్తారు.






పొద్దు పొడవగానే, మరిషూ నిద్రలేచి, అంతఃపురం వద్దకు పోతుంది.


























రాణి తనను వెంటాడుతున్న పీడకలలను మరీషాతో చెప్పింది.




సలూంకీ నా బొంతకాకిని, నన్నూ తరిమికొట్టాడు... ఏం చేయాలో
పాలుపోవడం లేదు. ఎటు పోవాలో కూడా తెలియలేదు....


రాత్రి పూర్తి కాగానే, నేను నా మానవరూపంలోకి మారిపోయాను. బొంతకాకి నా భుజాలపై కూర్చుంది. ఆడుకోవడానికి అది నాకు మాణిక్యం ఇచ్చింది. నా ఏడుపును పోగొట్టింది.


చూడండి! మరెక్ బిడ్డ! ఎవరీమె?
ఆమెను తల్లిదండ్రులు వదిలి పెట్టినట్లు కనిపిస్తోంది. ఏమిటది?
అది ఒక మాణిక్యం!


ఇది దేవుడి నుండి వచ్చిన సంకేతం!
ఇది సువర్ణద్వీప మాణిక్యం! సరిగ్గా మా తెగ పోగొట్టుకున్న మాణిక్యం ఇది.


ఏడవవద్దు బిడ్డా! నీవు మా కొత్త పూజారిణివి!


మహారాణీ, కొన్ని రహస్యాలు ఉన్నాయి. వాటిని మీతో తప్పక పంచుకోవాలి...
మీరు నన్ను మీ స్నేహితురాలిగా అంతఃపురంలో ఉండనివ్వాలి.
అదెంత పని...
నేను మీకు వ్యతిరేకంగా పనిచేస్తున్నానని నమ్మే శత్రువులు ఉన్నారు.వారిని అలాగే భావించనివ్వండి.
భయపడవద్దు. నిన్ను నేను కాపాడతాను.
ఇప్పుడు నేను ముగింపు ప్రారంభాన్ని చూస్తున్నాను.
(ఇంకా ఉంది)

## తిరిగే దారం

ఉబ్బసంతో బాధపడే పిల్లలకు ఈ ఆట చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఈ ఆట పిల్లలను వినోదంలో ముంచెత్తడమే కాకుండా, అదే సమయంలో వారు తమ ఊపిరితిత్తులకు కూడా మంచి వ్యాయామం అందిస్తుంటారు.







ఏమేం కావాలి?



- 10 సెంటీమీటర్ల పొడవైన ప్లాస్టిక్ స్ట్రా, దారం, వాడి పెన్సిల్, జంట కత్తెరలు.

తయారు చేయడం ఎలా?

- పది సెంటీమీటర్ల పొడవు ఉన్న ప్లాస్టిక్ స్ట్రాను తీసుకోండి. స్ట్రా మధ్యలో పెన్సిల్ పాయింట్‌తో రంధ్రం పెట్టండి. అయితే రెండో కొస వైపున పెన్సిల్ కొస కనిపించకూడదు.
- పెన్సిల్ పాయింట్‌ను ఒక కోణంలో గాటులో ఉంచి పెన్సిల్‌ను గుండ్రంగా తిప్పుతూ పాయింట్‌ను రంధ్రంలో ముందుకు నెట్టాలి. స్ట్రాలో పెద్ద రంధ్రం పడేవరకు ఇలా తిప్పుతూ పోవాలి. రంధ్రంలో పదునైన అంచులు ఉండకూడదు.
- ఇప్పుడు 50 సెంటీమీటర్ల నూలు దారం తీసుకోండి. దారపు ఒక కొసను రంధ్రంలో దూర్చి రెండో కొస నుంచి నెమ్మదిగా గాలి ఊదండి. దీంతో రంధ్రంలోంచి దారాన్ని అవతలకు పంపించడానికి వీలవుతుంది. దారపు ఒక కొసలో చిన్న ముడి వేయండి. ముడి తోక భాగం నున్నగా వచ్చేలా కత్తిరించండి.
- స్ట్రానుంచి వేలాడుతున్న నూలు దారపు ఉచ్చును మీరు చూడవచ్చు. ఊపుతున్నప్పుడు, మొత్తం దారపు ఉచ్చు తిరుగుతూ ఉంటుంది. ముడి రంధ్రంలో ఇరుక్కుని పోయిన ట్లయితే ముడిని చిన్నది చేయండి లేదా రంధ్రాన్ని పెద్దదిగా చేయండి.

**కాన్సెప్ట్:** దారంలోని ప్రతి నారను మీరు ఊదుతున్నప్పుడు అది దారాన్ని ముందుకు నెడుతూ ఉంటుంది. ఇలా దారపు వలయం మొత్తంగా రంధ్రంలోంచి కదిలిపోతూ తిరుగుతూ ఉంటుంది.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*

# కీటకాలు

ఒక ప్రత్యేక థీమ్‌పై ఆల్బమ్ (స్క్రాప్‌బుక్) రూపొందించడంలో మీకు సాయపడటానికి, మీరు నిధి పెట్టె చిత్రాలు ఉపయోగించుకోవచ్చు. ఈ నెల అంశం 'కీటకాలు.'


















# కార్యకలాపాలు

- నీడను సరిపోల్చండి





## ఎన్ని రూపాలు

త్రికోణాలు, చదరాలు, వృత్తాల సంఖ్యను లెక్కించండి



## చుక్కలను కలపండి











వీటిలో తేడాగా ఉన్న ఏనుగును కనిపెట్టండి



# Discover freedom with every ride!







*Round up the gang of girls and ride into the sunset. There's just nothing that can stop you, when you're in the seat of a Ladybird. So go ahead girls, hop on your Ladybirds and discover a new experience each day!*

Dreamz

CHANDAMAMA (Telugu) October 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




పార్టీ సన్నివేశం. అందరూ డ్యాన్స్ చేస్తున్నారు. సూరజ్, సరోజ, నిషా కూడా నర్తిస్తున్నారు.







సోఫాలో తూలుతూ ఉన్న అనీష్‌ని వారు కనుగొన్నారు.




ఎంత చక్కటి పార్టీయో కదా. నువ్వెందుకు డ్యాన్స్ చేయటం లేదు?




అనీష్ లేచాడు, నిషా అతడి నోటిలో బుబాలో కూల్ మింట్ పెట్టింది. అనీష్ చప్పరిస్తున్నాడు... .



... ఉన్నట్లుండి అతడి ముఖంపై నీరు చిందింది, తన కళ్లు విచ్చుకున్నాయి.




అనీష్ చుట్టూ చూస్తున్నాడు-







అందరూ సంతోషంగా ఉన్నారు, బుబా కూడా వారితో కలిశాడు.

